

# నవ్యాంధ్ర భవ్య జీవనులు



శ్రీ శ్రీరాములు రెడ్డి

# పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారి
# స్వీయ చరిత్రము

పుట్టితి రెడ్డివంశమున - బుట్టుకతోడ గురుత్వ మేర్పడన్
బుట్టితి రామచంద్రముఁడు - పుట్టిన పుణ్యాదినంబునంద నేఁ
బట్టితి రామపాదములు - పట్టుగ సేవలోనర్చి కోర్కెమైఁ
బట్టితి సత్కవిత్వమును - పండితపాళి కృపాబలంబునన్.

*　　　　*

శ్రీరామ నామధేయుఁడ
శ్రీరామ పదారవింద - సేవారతుఁడన్
ధీర జనాశీర్బలమున
నీ రహి సద్గ్రంథ నిచయ - మే రచియింతున్.

*　　　　*

నీతి తోలంగుచో జగము - నిందయొనర్చును నీతి యొప్పుచో
ఖ్యాతియు గౌరవంబు వెద - కం బనిలేక లభించు నేరికిన్
నీతియె ముఖ్యదైవతము - నీతియె సంపద యెల్ల మేలుముల్
నీతియె మోక్షదాయకము - నీతియె నీతికినై శ్రమించితిన్.

మాయది పూతలపట్టు గ్రామము. ఇది చిత్తూరుజిల్లా లోనిది. పురాతన ప్రసిద్ధ పట్టనము. కౌంతేయుఁడగు భీముఁ డిచ్చటనే సౌగంధికము తెచ్చి యిచ్చె నందురు. అందుచే పూతలుపట్టుని ప్రసిద్ధికెక్కెను. ఇందు భీమేశ్వరాలయము, వరదరాజస్వామి ఆలయము అను రెండు గొప్ప దేవాలయములు

కలవు. భీమేశ్వరాలయము భీమప్రతిష్ఠ యని ప్రతీతి. పల్లవులు పెద్దదిగా కట్టించినట్టు శిలాశాసనముకలదు. వరదరాజాలయము చోళులు నిర్మించినది. చిల్లర దేవాలయములు లెక్కకు మిక్కిలిగా కలవు. పట్టణము క్రమక్రమముగా క్షీణించి గ్రామమైనది. ఊరినడుమ మా తండ్రిగారు కట్టించిన శ్రీ కోదండరామ భజన మందిరము కలదు. మా తండ్రి పెద్దబుచ్చిరెడ్డి శ్రీరామభక్తుఁడు. నిత్యభజనసేయు శీలము కలవాఁడు. ఆయన ఈ గ్రామసమీప మందలి కలిగిరిపై శ్రీ వేంకటేశ్వరాలయము నిర్మించెను. మా తల్లిగారు లక్ష్మాంబగారు. మా తండ్రిగారు నిత్యము భజన సేయుటయేగాక గుడియొద్ద శ్రీరామ నవమి దినములలో హరి కథలు సేయుచుండువారు. అది వారి వృత్తికాదు. ప్రజలకు భక్తి యుద్బోధించుటకు మాత్రమే. ఆ కథలు వారురచించినవే.

## జ న న ము

క్రీ. శ. 1892 ఏప్రిలు 5 వ తేదీ నందనవత్సర చైత్ర శుద్ధ నవమి మంగళవారము రేయి ధనుర్లగ్నమున మా తండ్రి గారు శ్రీరామ ధ్యాన మగ్నులై శ్రీరామ జననకథా కాల క్షేపము సేయుచుండు సమయమున నేను జనించిన కారణమున నాకు శ్రీరామాభి ధానముంచిరి. నా వెనుక మన్మథ వత్సర శ్రావణ బహుళాష్టమిని నా తమ్ముఁడుదయించె. అతనికి బాల కృష్ణుఁడను పేరుంచిరి.

## వి ద్య

ఐదేండ్లు కాఁగా నన్ను మా గ్రామములోని ప్రాథమిక పాఠశాల కంపిరి. అచ్చట అయిదేండ్లు చదివితి. చదివినంత

వఱకు బడిలో ప్రప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుఁడ నగుచుంటి. నాకు ధారణాశక్తి అధికముగా నుండెను. ఒకసారి చదివినది మరల చదువనక్కఱ లేకుండెను. మా ఉపాధ్యాయులు ఎద్దనపూడి శేషయ్యగారు నన్నధిక వాత్సల్యముతోఁ గాంచువారు. వారు గొప్ప వేదాంత వేత్తలు. ప్రతి శనివారము గ్రామమున జరుగు తత్త్వవిచార సభలో వారు పన్యసించు చుందురు. దానికై వారు వ్రాసిన వ్యాసములు నాచే శుద్ధప్రతి వ్రాయించువారు. అందలి పద్యములు విషయములు నాకు కంఠస్థములే. ఆ యుపన్యాస ములలో కొన్ని అచ్చైనవి. వారు వేసిన పునాదియు మా తండ్రిగారి సంకల్ప బలమును నన్నింతవానిగా నొనర్పఁజాలినవి. ఇంగ్లీషు చదివింప మా తండ్రిగారి కిష్టములేదు. కులము చెడి పోవుదునను భయమధికము. మా మేనత్తభర్త శ్రీ రామారెడ్డి (కొళందరెడ్డిగారి తండ్రి) కట్టమంచినివాసి. తాను నన్నుకొని పోయి చదివింతునన్నను మా తండ్రి బొత్తిగా సమ్మతింపలేదు. కావున నా బడి విద్య అంతటితో సమాప్తి చెందినది. మా తండ్రిగారు రచించిన హరికథలు నేను ఎత్తి శుద్ధప్రతి వ్రాయు చుంటి. అవియెల్ల నాకు కంఠస్థములే.

## సంగీతము

మా గ్రామమున చెంగయ్య అనుగురిని కడ సంగీత విద్య నేర్వ మా తండ్రి నియమించెను. అయిదేండ్ల కాల మభ్యసించి స్వరములు జంటవరుసలు హెచ్చుస్థాయి వరుసలు పిళ్లారిగీత ములు స్వరజతులు తానవర్ణములు కొన్నికృతులు నేర్చితి. వెన్నపడు సమయమున బాన పగిలిన చందమై నా దురదృష్ట

కారణమున మా సంగీత గురుఁడు కాలధర్మము నందెను. తరువాత మఱియొక గురుని యొద్ద ఫిడేలు కొంతకాల మభ్యసించి వర్ణములవఱకు వ్రాయించితి. అదియు పూర్తిగాక అఱగొఱగా నిలిచిపోయెను. నాకు పదునేడేఁడులు పూర్తియగు నప్పటికి మా తండ్రిగారు పరమ పదము చేరిరి. అంతటితో నా సంగీత సాహిత్యములు కట్టి కట్టఁబడి అటుకపై కెక్కెను. సంసార భారము తలపైఁబడెను. మా తల్లిగారు నా పందొమ్మిదవ యేటనే నాకు వివాహము కావించి తమ భారము దించుకొనిరి. నా పిన్న వయసుననే సంసార భారము తలపైఁబడుటకు తోడు ఏటేఁట జరుగు శ్రీరామ జయంతి ఉత్సవములు జరుపుట కష్టతర మయ్యెను. కథకులు దొరకు టరిదియయ్యె. నా మిత్రుల ప్రోత్సాహ మధికరించుటచే వచ్చియు రానిస్థితిలో జంకు గొంకుతో కథలుచెప్ప నారంభించితి. కొంతకాలమునకు జంకు తీరి నిర్భయముగా కథలుచెప్పఁగలిగితి. ఫిడేలు హార్మోనియము వాద్యములు స్వయంకృషిచే కొంతవర్ధిల్లె.

ఇరుగుపొరుగు పల్లెలవాండ్రు మా తండ్రిగారిపైఁగల గౌరవముచేతను, నాపైఁగల వాత్సల్యముచేతను నన్ను ప్రోత్సహించు కోరికతో రమ్మనఁ గాదననేరక అటనట కొన్ని కతలు జరపితి. ఆ కాలమున నా మేనత్తకుమారులు రంగస్వామిరెడ్డి, కృష్ణారెడ్డి అనువారలు వారి అన్నగారి (కొళందరెడ్డి) ఆదరువున బందరులో చదువుచుండి వారికి దొరకిన కావ్యములను నాకు తపాలు మూలమున పంపుచుండిరి. వానిని చదువుటచే నా భాషాజ్ఞానము క్రమక్రమముగా అభివృద్ధిచెంది కవిత్వముచేయ దారితీసినది. కవితయం దభిరుచి కలిగించినవానిలో ముఖ్య

మైనవి శ్రీ తిరుపతి వేంకటకవుల నానారాజ సందర్శనము, శతావధానసారము, శ్రవణానందము, చిలకమర్తివారి నాటకములు మున్నగునవి. నా కవితాజ్ఞానము కొంత గట్టిపడఁగా 'కీరవాణి' అనునొక ప్రబంధము రచించితి. తరువాత 1919 సంవత్సరమున పాకాల మాధ్యమిక పాఠశాలయం దాంధ్రోపాధ్యాయుఁడుగా చేరితి.

హరికథ లెవ్వ రెందఱుగ నప్పుడ తప్పక చెప్పుచుంటఁ బా
మర జనరంజకంబుగ సుమారొక యిర్వది వత్సరంబు లా
సరణియు మానవాళికి శ్మశాన విరాగితచంద మాటచే
మఱియొకత్రోవఁబోవ మది మార్చితి బాలురకై శ్రమించితిన్.

*　　　　　*

బాలకపాళికిం దగిన - భావములం బహు పుస్తకంబులం
బోలఁగ వ్రాసితిం దెలివి - పుట్టఁగ నక్షర రాజినుండి ని
ర్వేలగ మంచి పాండితి వరించెడుదాఁక నవీన పద్ధతుల్
గ్రాలఁగ వాచకంబులు పురాణకథల్ తగు శబ్దశాస్త్రముల్.

ఇంత శక్తి స్వయంకృషిచే ఎడతెగని సద్గ్రంథ పఠనముచే వృద్ధియైనది. మా సహోపాధ్యాయులు నాతో మేము లక్షణము నేర్చి లక్ష్యములు సాధింతుము. మీరు లక్ష్యములతో లక్షణములు సాధించుచున్నా రని యనుచుందురు. మా సన్నిహిత బంధువులు పూజ్యులు మదీయ హితైషులు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు 'మందలింపు' అను నా చిన్ని పొత్తము (శతకము) నకు చిన్న పీఠిక వ్రాయుచు ఇట్లనిరి.

ఇప్పుడు మా బంధువులలో సరసులును, పండితులును

కవులునై వఱలు వారలలో పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు గణనీయులు. వీరు స్వయంకృషి య ప్రధానముగ విద్య నార్జించినవారు కాన సహజ పాండిత్యు లనఁదగుదురు. లోకోపకారకముగ అనేక గ్రంథములు వ్రాసియున్నారు. వీరు ముఖ్యముగ నాశించుపరమార్థముశీలము. నడవడిలేనిది నడపీనుఁగులగుటయ.

హిందువులలో యోచనలకు కొఱఁత లేదు. ప్రపంచమున కంతయు మాటలతో మాత్రము దారిచూపుటలో వీరు అద్వితీయులు. భావములు మెండు. తత్వములు తెలుచు. అనుష్ఠానము మాత్రము అత్యల్పము. శ్రీ గాంధీమహాత్ముల ప్రభావముచే శీలము వృద్ధియైనది. కావలసినంత కాలేదు. వారిని పూజించువారు అనేకులు. అనుసరించువారు కొంతమందియ. మొత్తముమీద సంకల్ప దార్ఢ్యము, సత్యము, ధైర్యము, స్థైర్యము మనయందు చాల తక్కువ. త్రికరణశుద్ధి న్యూనము.

ఈ క్షయస్థితినిచూచి మనసు కమలినవారై శ్రీరాములు రెడ్డిగారు దుశ్శీల ఖండనములును, సుశీల ప్రేరేపకములును అయిన కొన్ని పుస్తకముల వ్రాసి ప్రకటించి నీతిని నిల్ప ప్రయత్నించు చున్నారు. వానిలో "మందలింపు" "ఇప్పటికలి" ముఖ్యములు. వారి యీ వాక్యములు కటువులుగా నుండునేమో!

"కార్యగతుల తెఱఁగు - కలరూపు సెప్పిన
నధికమతులు దాని - నాదరింతు
రల్పభాగ్యబుద్ధు - లగు వారలకు నది
విరస కారణంబు - విసమువోలె" (భారతము)

భావములు పరుషములుగా నున్నను శైలి యెంతయు సరళము. చక్కెర పూసిన మాత్రలు. వీరి నీతిగ్రంథములు లోకోక్తులతోను, సహజోపమలతోను నిండి చదువువారికి తీపిగా నుండును. వీరిదైన శీలోద్ధరణోద్దేశము సఫలమగునుగాక.

పద్మప్రభాస
చిత్తూరు } కట్టమంచి రామలింగారెడ్డి.

ఈ వీరి వాక్యములబట్టి నా నడవడి, స్వభావము సువ్యక్తము. ఆత్మస్తుతి యనవసరము.

పాకాల మాధ్యమిక పాఠశాలలో 1919 లో చేరి తొమ్మిదేండ్లు పనిచేసితి. 1924 లో ఒక పెద్ద వ్యాకరణము వివరణప్రాయముగా 'ఆంధ్రభాషా లక్షణ శిక్షణము' అను పేర వ్రాసి అచ్చొత్తించితి. 1928 కడపట చిత్తూరు ఉన్నత పాఠశాలకు మార్పంబడితి. అట ఉద్యోగజీవితము పూర్తిగాఁ గడపి 1948 లో విశ్రాంతి నందితి. మరల అధికారుల ప్రార్థనచే రెండేండ్లు అందే పనిచేసి విసుగుతో వదలఁగా చిత్తూరు పురపాలక సంఘమువారు నన్నియకొలిపి తమ కస్తూరిబా బాలికోన్నత పాఠశాలకు రప్పించుకొనిరి. వారి వేఁడికోలు కాదనలేక అట అయిదారేండ్లు కడపి పిదప పూర్తిగా విరమించితి.

## ఉద్యోగకాల పరిస్థితులు

పరుల ధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు – బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు తెవులులేని వేద – నంబడు నధిపా.

అను విదురనీతికి అనుభవసిద్ధమైన దృష్టాంతములు పెక్కు-లేర్పడినవి. మిత్రద్రోహములు, సహచరద్రోహములు, ప్రోత్సాహకారక గురుద్రోహములు పెక్కులు గలిగినవి, అన్నిటిని ఓర్పువలననే జయించితి. అవి తమయంత సన్నగిల్లి నశించినవి. వారికి దేవుడు కావించిన శిక్షలు నేను కోపించి చేసియుండఁ జాలను.

ఒకనిద్రోహి సుమిత్రపద్ధతుల సంయోజించి దాపించి పు
స్తకముల్ కొన్ని గ్రహించి కంపెనికి మొత్తంబిచ్చి రొక్కంబు కో
రిక నిప్పించెదనంచుఁ బిమ్మటఁ బ్రతారించెన్ స్వకీయాభిధం
బ్రకటించెన్ ధనమేమి నీయకయె నామాలేసి నిర్భీతియై.

* *

కృపణుండొక్కఁడుసూనుఁదోడికొని యర్థిన్‌వచ్చి యెంతెంతొ తి
య్యపుఁబేర్మిన్ బతిమాలి యైనసమలొయ్యన్ మెక్కి బన్నంబు ల
గ్గపడం గూర్చెను తిండివెట్టితిని చొక్కారంబుగా విద్య నే
రిపితిం దండుగగాఁగ రొక్కమును వేరే యిచ్చితిన్ మోసచే.

* *

ఆ పనుల్ నమ్మిన స్వయంకృతాపరాధ
ములె యటంచు నోర్చితి నొక పుణ్యజనుఁడు
బాల్యమిత్రు సౌహార్దమును పాడుచేసె
నయ్యది తలంప నిపుడు నన్నలఁచుచుండు.

అదియటుండ పండితులని పేరొందిన కొందఱు నా గ్రంథములు చదువ తీరికయే లేకుండె ననువారును అభిప్రాయము తెలుపుదుమనియు. మీ జీవిత చరిత్రము వ్రాయ నిశ్చయించి

యున్నాగమనియు, మఱియు ననేక విధములుగా గ్రంథము లుచితముగా తెప్పించుకొని యేండ్లకొలఁది మూఁకలై యుండిన వారు నీ యాంధ్రావనియందు కొందఱు కలరు. ఇంతకు ముఖ్య కారణ మొక గొప్ప ప్రసిద్ధ పండితుఁడు నీవు బ్రాహ్మణుఁడవై పుట్టుక పోయితివయ్యా! అదియే నీ యందలి పెద్దలోటు, అన్నాఁడు. అదిమాత్రము నా జన్మజన్మములకు వలదని రాముని ప్రార్థించితిని. అయినను అందఱును అట్టివారే యనఁజాలను. వారట్టులు వచించుటయే యిందుల కుదాహరణముకదా!

## సంపాదనము

నా తోడియుపాధ్యాయుఁడు నాకంటె తక్కువ గ్రంథములు వ్రాసి యచ్చొత్తించి యధికధనము గడించెను. కను రెప్పలమీఁది వెండ్రుకలవలె ఎదుగూ బొదుగులేక నాస్థితి ఎప్పటియెట్లు యున్నది. నాకు కుమారులు లేరు గ్రంథ సంతానము తక్క. నలువురు కుమార్తెలు. వారిని చదివించి వివాహాదికము లొనరించి దుహితౄణవిముక్తి నొందితి.

నా స్థితిగతులు తెలుపు పద్యములివి.

మొనపున నించుమించుగను-ముప్పది గ్రంథము లచ్చుగూర్చితిన్
ధనము గడించు మార్గములు - తత్పరతం బరికించి చూచితిన్
మనమున నించుకేనియును - మన్నన గూర్పనివంచు నెంచితిన్
మనసును చంపుకో జనిసి - మానితి వర్తకచింత నంతటన్.

* *

ధనమునిచ్చి కొనెదు - ఘన వదాన్యులకంటె
నురకకొను మహాత్ము - లుంద్రు పెచ్చు

వెట్టిసెట్టిబేర - మిట్టింకులం బొందు
చందమయ్యెఁ గొన్ని - సమలలోన.

*　　　　*

మొదలుచెడు బేర మిట్టులు
తుది ముట్టకయుండ దొరలె - దొరతనమందున్
బదిలములగు శాసనములు
తుద కది విఘ్నేశు పెండ్లి - తోయంబయ్యెన్.

ఇట్లు నే ననేకవిధముల నష్టము లొందుచుండినను విసుగక కాదనక తగదనక అడిగినప్పు డడిగినంత ధనము సాయము చేయుచుండిన శ్రీ కొత్తకోట రామస్వామిరెడ్డిగారును, వారి కుమారులు శ్రీ వేంకట్రామా రెడ్డి గారును నాకు సర్వదా సర్వథావంద్యులు.

తనయుఁడు తండ్రియున్ బహువిధంబులఁ జేసిన సాయమే ననున్
జనులకుఁ జూపఁగల్గినది చాలిన సజ్జనసంఘ మాన్యుఁగా
ననయము వారు పెట్టిన ప్రియంబగు దీపమె మద్గృహంబునన్
గొనకొని వెల్గుచున్నయది కూరిమి తైలముతోడ నేటికిన్.

పాఠశాలా సంబంధ గ్రంథములు వ్రాయుట మానితి. శాశ్వతముగా కీర్తికరముగానుండు గ్రంథము లేవైన వ్రాయఁ దగుఁగదా యని యోచించితి. కాళిదాస కుమారసంభవము పదునేడు సర్గలును, జగద్గురు శంకరాచార్యకృత ప్రశ్నోత్తర రత్నావళియు, భారతాంతర్గత యక్ష ప్రశ్నలు తెనిగించితి. తక్కినవి చర్విత చర్వణములే యని మానితి.

ద్రవిడభాషయందు కొంత ప్రవేశము సంపాదించుకొని యందలి యుత్తమ గ్రంథములు త్రివర్గము (తిరుక్కు-ఱళ్) కంబరామాయణము పదివేల అయిదువందల డెబ్బదినాలుగు పద్యములుగల మహోత్కృష్ట గ్రంథము తొమ్మిదివేల అయిదు వందల పద్యములుగా తెనిగించితి. తిరుక్కు-ఱళు తమిళ వేదము. కంబనియింటి కంబమును క్రమకవిత్వము చెప్పనేర్చునను నా నుడిగల రామాయణ గ్రంథము అఱవలకు పరమ ప్రమాణ గ్రంథము. దీనినిగూర్చి కట్టమంచి రామలింగారెడ్డిగారు "విషయమునందు లోకారాధ్యము, శైలియందు లోకానందము." అని పీఠికయందు నుడివి యున్నారు. (చూ. నా కంబరామాయణ పీఠిక) మఱియు పీఠికయందు తుదినిట్లు పేర్కొనిరి. "శ్రీరాముఁడు సేతువును గట్టి లంకకు మనకు యానసౌకర్యము కల్పించినాఁడు. కాని యది సంహారక్రియకై. ఈ శ్రీరాముఁడు భాషాసేతువును గట్టి తమిళులకు మనకు పరస్పర విద్యాజ్ఞాన వికాసములకై సౌకర్యము గల్గించియున్నాఁడు. ఆ సేతువును సముద్రము ముంచి మ్రింగివైచినది. ఈ వాఙ్మయసేతువు ఆచంద్రార్కము శాశ్వతముగ నిలిచి అఱవలకు, నాంధ్రులకు నాగరకతా సాంగత్యమును పెంపొందింపఁ గలదు." ౪ చతుష్పది (నాలడియార్) ౫ పెద్దపురాణము శైవుల (నాయనారుల) దివ్య చరిత్రము. ౬ విద్యార్థికోశము (చిన్న నిఘంటువు) ౭ శబ్దార్థ కల్పకము (పెద్ద నిఘంటువు) అన్ని పారిభాషిక పదములు చేర్పఁబడినవి) ౮ అభిధాన దర్పణము (ఈ 3, ౪, ౬, ౭ అచ్చు గా లేదు) ౯ అందిమకత (శిలప్పదిగారము) ౧౦ మణిమేఖల ఈ రెండును

తిరుపతి దేవస్థానమువారు ముద్రింపించి ప్రకటించిరి. ౧౧ భారతి వారి మధురకవితా సంహిత దీనిని కేంద్ర సాహిత్య అకాడమీ వారి యాజ్ఞానుసారము తెనిఁగించితి. విజయవాడ విశాలాంధ్ర గ్రంథాలయమువారు ప్రకటించి యున్నారు. ౧౨ తెనుఁగు సందేశము ఇంతవఱకు ఆంధ్రభాషలో లేనిది. ౧౩ నీతిగుచ్ఛము (సామాన్య నీతులు, అన్యాపదేశములు సుమారు నాలుగు వందల పద్యములు.)

మఱియు శతకములు, వాచకములు, ఉపవాచకములు, పెక్కులు రచించితి. అవి ఇప్పు డుపయోగ దశాదూరము లైనవి. మదీయ విరచిత గ్రంథములు రమారమి డెబ్బది.

## సన్మానములు

ముఖ్యములు కొన్ని,

7-3-1953 నెల్లూరిలో ఏఁటేఁటజరుగు తిక్కన వర్ధంతికి నన్ను పిలిపించి కవిచకోరచంద్రులు శ్రీ తిక్కవరపు రామిరెడ్డి గారు సత్కరించి కంబరామాయణ ముద్రణమునకు మూఁడు వేల రూపాయ లొసఁగిరి.

28-3-1953 కారైక్కుడి కంబకవి సంఘము వారు ఏఁటేఁట జరుపు కంబకవి తిరునాళ్ళకు పిలిపించి జాంబూనద దాంబర మొసఁగి గౌరవించిరి.

23-6-1957 మదరాసు ద్రవిడ రచయితల సంఘము వారు స్వర్ణపతక మొసఁగిరి.

16-1-1960 గుడివాడ ఆంధ్ర నలంద సంఘమువారు స్వర్ణఫలక మొసఁగి సత్కరించిరి.

6-5-1960 హైదరాబాదులో జరిగిన అఖిల భారత తెలుగు రచయితల మహాసభ ప్రథమ సమావేశ సమయమున సత్కరించిరి.

19-7-1962 గద్వాలపుర ప్రముఖులు పిలిపించి సన్మానించిరి.

భా ష

సలక్షణభాష నాకు సమ్మతము. గ్రామ్యమని వ్యావహారికాంధ్రమని పేరు లొందుచున్న భాషనా మదికి నింపవు. భాష కాల క్రమమున మాఱుచుండ లేదా యందురా? కలదు. దాని నొప్పుకొందును. వికారభాష, చాల నీచజాతులు మాటలాడు గ్రామ్యము సమ్మతముకాదు. దానినే, సమ్మతించుచో పాఠశాల లక్కఱలేదు. ఉపాధ్యాయు లక్కఱలేదు. ఎవనికిఁదోచినట్లు వాఁడు వ్రాయవచ్చు, మాటలాడవచ్చు. అది నియమరహిత భాష యగుచున్నది. పంచభూతములు, సూర్యచంద్రులు, నియమము మీఱుచుండిరా? తల్లిదండ్రుల మాటలు వినని తనయులు, గురువుల పలుకులు లెక్కపెట్టని శిష్యులు ఏమగుదురు? అంతయే నియమరహిత భాషయు.

సీ॥ కారణ జన్ములఁగాంచి జగమ్మున
ఘనత గాంచినది మా తెనుఁగుతల్లి
కోహినూరుకంటె నెక్కుడు జీవరత్నాలఁ
బడసినయది తెల్గు భాగ్యలక్ష్మి

పెన్న గౌతమి కృష్ణవేణి పయస్సుచేఁ
బుష్టినొందిన దాంధ్ర పూతధాత్రి
అఖిలదేశమ్ముల కాహార మొసఁగి ర
క్షించు చున్నది ఆంధ్ర జీవదాత్రి

సత్కవి ప్రవరులకిది జన్మభూమి
బహువిధావధానుల కిది పంటపొలము
పావన క్షేత్రములకిది ప్రథితధరణి
భరతమాతృ హృదయమంధ్ర భవ్యసీమ.

*　　*

సీ॥ నాదమై జనియించి నాదుతో వర్ధిల్లి
నాద లీనయగుచు నాణెమందె
అక్షర రూపిణియై కీర్తికాంతితో
నలరి సుందర పుస్తకాంగియయ్యె
సంగీత సాహిత్య సారస్వతమునేర్పి
జీవులలో మేటిస్థితి యొసంగె
మంచిమాటలు తెల్పి యంచిత మతినిల్పి
యశము గౌరవము నింపారఁగూర్చె

తిండికై పుట్టవలదను తెలివినిచ్చె
సత్యశౌచదయాదుల సరణినిచ్చె
కన్నతల్లి సుగుణమల్లి కల్పవల్లి
తేటతెల్లమై వెలిగెడి తెలుఁగుతల్లి.

*　　*

సీ॥ సంగీతమునకుఁ బ్రశస్త భాషయనుచుఁ
దీయతీయములు స్తుతించినారు
తేనెవంటిదనుచుఁ దేట తెనుంగని
పలువురు పలుమరు పలికినారు
లిపియు నుచ్చారణ లీనమైనవనుచు
ధీరవరులు సన్నుతించినారు
ఆంధ్రుడై పుట్టుట ఆంధ్రంబు నేర్చుట
పూర్వపుణ్యమనుచుఁ బొగడినారు

తెలియునది తెలుఁగని వినుతించినారు
జాను తెనుఁగనినారు విశ్వకవి వరులు
పరులె నీ సేవ చేసిరి భక్తులగుచు
మధురమయివమ్మ మా యాంధ్ర మంజువాణి.

* *

అపశబ్దమ్ముల కుమ్మరదమ్ముగొని బహ్వర్థక్షయమ్మైనలో
నపలాపింపక వృత్తభంగమున కత్యానందులై యేచి ని
త్యప్రవృత్తులై యాంధ్రమునందదుర్నీతులచందంబొందు గ్రామ్యార్థవా
గ్విపరీతాత్ములఁ ద్రిప్ప నూతనవిధా విస్రష్ట జన్మించునే?

* *

సరళాదేశము చేయ లేదని యనుస్వారంబు లేదంచు సం
ధిరహింం జేయరయంచు వ్యర్థముగ వాదింపంగనేలా మహా
నిరయం బబ్బిన దాంధ్రభారతికి వాఙ్నిర్వీర్య మూర్ఖాలిచే
దొరఁగం ద్రోవంగరండు లెండదియు కాదో ముఖ్యకార్యంబిటన్

# ప రి చ య ము

ద్రావిడ గ్రంథములు గొప్పవి యనువదించుట వలన కంబన్ తిరునాళ్ళలో కార్తికేయ్యుడి యందును, మదరాసులో తమిళ రచయితల సంఘమునందును సన్మానింపఁ బడుటవలన దక్షిణదేశమునం దించుమించు పండితులు మొత్తము నాకు మిత్రులైరి. ఏచోట కేగినను నన్నెఱుగనివారు గౌరవింపనివారు లేరు. ఆంధ్రదేశమున నెల్లూరిలో గుడివాడలో హైదరాబాదులో జరిగిన సన్మానముల వలన ఆంధ్రదేశమునం దంతటను పండిత వర్గమునకును భాషాభిమానులకును ఎఱుకగలవాఁడనైతి. నేనుద్యోగము చేయుచుండిన చిత్తూరుబోర్డు హైస్కూలు మా జిల్లాలో పెద్దదిగనుక పలుప్రాంతములనుండి వచ్చి చదువుచుండిన విద్యార్థుల సంఖ్య అమితమగుట చేతను అనువత్సరమును అధిక సంఖ్యాకులగు విద్యార్థులు చదువు ముగించుకొని బడివదలి కళాశాలలలోను పలుశాఖలందు ఉద్యోగములలోను చేరుటచేతను మాశిష్యులు లేని పట్టణమే భారతదేశమందు లేదనవచ్చును.

ఏచోట కేగిన నగుమొగములతోఁ గానవచ్చు శిష్యులసంఖ్యాకులు. అన్ని శాఖలందును ఉద్యోగులుగా నుండుటచే నాకు క్రొత్తచోటు లేదనుట అతిశయోక్తి కాదు. మా జిల్లాలో ఏ ఆఫీసునకు వెళ్ళినను శిష్యవర్గమే కనిపించుచుండును. సంతోషముతో నా వచ్చినపని మున్నుగ నెఱవేర్చుచుందురు. ఏ కొండకుపోయినను, ఏకోనకుపోయినను మాశిష్యులు గానవచ్చుచుందురని మా మిత్రులు కొందఱు ఛలోక్తు లాడుచుందురు.

నాతో ముఖపరిచయము లేనివారు పెక్కండ్రున్నను

గ్రంథముల మూలమున నెఱిఁగినవా రధికసంఖ్యాకులు. నా యుపన్యాస మొక్కపరి విన్నవారు మరల నన్ను మఱచుట కల్ల. సమస్తము శ్రీరామానుగ్రహము.

నన్ను ప్రేమతో గౌరవించువారలు ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమి అధ్యక్షులు రెండుపర్యాయములు సభ్యత్వ మొసఁగిరి. తిరుపతి సర్వకళాశాలవారును మొదటినుండీ సెనేటు సభ్యునిగా ఎన్నుకొన్నారు.

## నివాసము - ప్రవాసము

నేను పుట్టినది పెరిగినది విద్య నేర్చినది పూతలపట్టుననే. కవిత యభ్యసించినదియు స్వగ్రామముననే. తండ్రి మరణానంతరము కుటుంబభారము తలపైఁబడఁగా సేద్యము చేసితిని. అదియు గ్రామమునకు మార్గదర్శకముగాఁ జేసితి. ఇద్దఱ జీతగాండ్ర నుంచుకొని నేనును కష్టించితిని. వ్యవసాయమునం దన్ని పనులు చేసితిని. దున్నుట, చదరకట్టుట, విత్తుట, గూడవేయుట ఏఁతమెత్తుట, మోటతోలుట, ఏఁతము మోట యంత్రస్థాపనము చాలుమూలగ నెఱుఁగుదును. ఒకసారి ఐదేండ్ల కఱవు రాగా సుమారు మైలుదూరమునుండి మోటతోలి చేసిన పైరు గాపాడితిని. కుటుంబభారము మితిమీఱఁగా పాకాలలో మాధ్యమిక పాఠశాలయం దాంధ్రోపాధ్యాయ పదవిలోఁ జేరితిని. అప్పటి నా జీత మత్యల్పము. ఇరువదియైదు రూప్యములే. కుటుంబము భరింపరాని బరువైనది. శ్రీరాముని ప్రవాసము వలెనే నా ప్రవాస మేర్పడెను. కాని తారతమ్య మత్యధికము. అతనికి కుటుంబ రాజ్యభారములు వదలెను. నాకు హెచ్చెను.

ఆతఁడు దుష్టులఁ బరిమార్చి శీలోద్ధరణ మొనర్చెను. నేనును శీలోద్ధరణమునకై ప్రయత్నించితి. ఆతనికి శాశ్వతఖ్యాతి లభించెను. నాకు నల్పకీర్తి కలిగెను. అది శాశ్వతమో అశాశ్వతమో నేను నిర్ణయింపజాలను. రాముఁడు తుదిని అయోధ్యకు వచ్చి పట్టముఁ గట్టుకొని తమ్ములతో సుఖించెను. నేనును ఉద్యోగ విరమణానంతరము పూతలపట్టుచేరితి. అప్పటికి తమ్ములు నన్నువీడి పరలోకముచేరిరి. నేను ఒంటరివాఁడనైతిని. గ్రామ వాసము మునుపటికంటె కడుంగడు దుర్భరమయ్యెను. కారణ మేమందురా? పూర్వము గ్రామ జీవితము అమాయకము. మోసము వంచన లేనిది. పాలలో నీరు కలుపరు. క్షీరవిక్రయము అన్న విక్రయము మహాపాతకములుగ నుండెను. ఇప్పుడవి ముఖ్యవృత్తు లయ్యెను. రాజకీయములన నేమో ఆనాఁటి గ్రామీణు లెఱుఁగరు. ఈనాఁడు ఓనమాలు రానివాఁడు మంత్రి సత్తముల విమర్శించు మహోపాధ్యాయుఁడు.

"అధికార మొక్కటి యబ్బదుగాని మే
జస్ట్రేట్లు వారికి సములుగారు
ఫీజు లేదనుమాట వెల్తియొక్కటిగాని
ప్లీడర్లు వారికి జోడుగారు"

అను మహాకవి వాక్యమునకు, లక్ష్యములై యున్నారు. వంచనము, మోసము, అసూయ, మున్ను పట్టణములయందే యుండెను. ఇప్పుడు వానికి పల్లెపట్టులు ఆటపట్టులయ్యె. పట్టణములలో కరారుబేరము లేర్పడెను. పాలలో నీరుకలిపి, నేతిలో నూనె కలిపి అమ్ముట పల్లెలలోనికివచ్చి నిలిచెను. పట్టణము

లలో వానివాని వృత్తివ్యాపారము వానిది. పొరుగింటివారి పొత్తు వారి కక్కఱలేదు. పల్లెటూళ్ళలో కక్షలు కోర్టువ్యాజ్యములు, కొట్లు, తిట్లు ప్రబలి ఐకమత్యము నశించినది. పిన్న పెద్ద తారతమ్య మడుగంటినది. పట్టనములలో ఆ యా వృత్తులవారికి సంఘము లేర్పడి క్రమపద్ధతి, ఐకమత్యము నెలకొనఁగా పల్లెలలో పేరులేక పోయినది. దానము, ధర్మము, భక్తి పూర్వము పల్లెటూళ్ళలోనుండి యిప్పుడవి నాగరికతా వ్యామోహులవలె పట్టణములలో చేరెను. పూర్వపు దేవాలయము లన్నియు నిప్పుడు గబ్బిలముల కునికిపట్టులయ్యెను. నిత్యపూజలు నిశ్శేషము లయ్యెను. గుళ్ళన్నియు నూరివారికి మఱుఁగుదొడ్లయ్యెను. పట్టనములలోని దేవాలయములు కైలాస వైకుంఠములయ్యెను.

కావున తుదిజీవితము స్వగ్రామమున గడుప నిశ్చయించిన నాకది దుస్సహ మనోవేదనకు కారణమైనది. విడువ లేకయు, ఉండి భరింప లేకయు రెంటికీ జెడ్డ రేవనివలె నున్నాడను.

కేంద్రప్రభుత్వము నా రచనా పరిశ్రమను గుర్తించి యిచ్చు కొలఁదిపాటి ఉపకార భృతితో నిశ్చింతముగా కాలము గడపుచున్నాను. ఆస్తిలేదు. అప్పులేదు. లేదను చింతయులేదు. నెమ్మదిగా జీవిత శేషము గడపుచున్నాను. ఇయ్యది మదీయ జీవిత సంగ్రహ చరిత్రము. నమస్సులు.

సెలవు.

పూతలపట్టు శ్రీరాములురెడ్డి.



# పండిత సత్యనారాయణరాజు

పండిత రాజు, కవిరాజు, తెలుఁగురాజు, కవితావిశారద, విద్వాన్, మొదలగు బిరుదములు పొంది, జయపుర సంస్థానాస్థాన కవియై, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి కార్యనిర్వాహక సభ్యుఁడై అఖండఖ్యాతి గాంచుచున్న పండిత సత్యనారాయణరాజు పశ్చిమ గోదావరిజిల్లా నరసాపురము తాలూకా వేడంగి అను గ్రామములో

ఆది వికారి సంవత్సరమందు మార్గ
శీర్ష బహుళ చతుర్థి బుధార్క దినము;
పుష్యమీ ఋక్షమునయందుఁ బుట్టినాఁడు
తల్లి పుట్టింట బందుగు లుల్లసిల్ల.

20 డిసెంబరు 1899 'తెలుఁగురాజు' పేజీ-౫

వేడంగి మాతామహుల యూరు. మాతామహి వేంకయ్యా. మాతామహుఁడు వత్సవాయి సుబ్బరాజు.

*తల్లి రాఘవయ్యా. తండ్రి వేంకటపతిరాజు. ఇంటిపేరు పెనుమెచ్చ. వీరి యూరు కాఁకరపఱ్ఱు.

'పండితాకరమ్ము పశ్చిమ గౌతమీ
మండలాంతరాళ మండనంబు
తణుకు లంకసీమఁ దనరు కాఁకరపఱ్ఱు',

రాజు జన్మభూమి.

---

* క్షత్రియ స్త్రీ పేరుచివరల అయ్యా - పదము గౌరవసూచకము. ఇట్లే హ్యాట్లాండులోని గౌరవ స్త్రీలకు పూర్వము 'సర్' అను పదము చేర్చి పిల్చెదువారు. 'బ్రౌను'

౧-20



శ్రీ పండిత సత్యనారాయణరాజు

మనిరచ్చట తత్ పూర్వులు
ధనంజయ సగోత్రులును వదాన్యులు కాత్యా
యన సూత్రులు శశికులజులు
మనుమార్గము వీడనట్టి మాన్య గుణాఢ్యుల్.     2-పే.

*     *

జనులు పెనుమెచ్చ నిరతము
ఘనతర కార్యములు తాము కావించుటచే
పెనుమెచ్చ యింటిపేరును
గొనినా, రదె (మాకు) నాటఁగోలెం జెల్లున్.     2-పే.

*     *

పెనుమెచ్చవారు :

మొగలిదుర్తి విభుల గ్రామాలను వీరుతా
విజయనగర నృపుల విపుల సభల
ముఖ్యమంత్రులౌచుఁ బాలించిరి తతపూర్వ
లేలినారు ర్యాలినేల, లీల.     2-పే.

*     *

ఈ కాకరపర్తి పెనుమెచ్చవారు ముక్త్యాలమండి - అజ్జరము - అచ్చటనుండి కాకరపఱ్ఱు వచ్చి స్థిరపడినారు. అసలు పెనుమెచ్చవారి పూర్వపూర్వులు నేటి కృష్ణాజిల్లాలోని పెనుమెత్స గ్రామమునుండి వచ్చి తణుకు తాలూకాలోని గుమ్మంపాడు అను పల్లెటూరిలో, మొట్టమొదట స్థిరపడి పిమ్మట వంశములు వృద్ధియైనకొలఁది చాలగ్రామములకు వెడలి

స్థిరపడినారు. క్షత్రియులున్న గ్రామములో పెనుమెచ్చవారు లేనిచోటు లేదు.

క్షత్రియులలో ఒక కథ కూడ వాడుకలో ఉన్నది. ఒక క్షత్రియుడు పెనుమెచ్చవారు లేని గ్రామములో కాపురము చేయుదమనని యెంచి పోయిపోయి అంతర్వేది సముద్రపుటొడ్డున ఒక గ్రామములో ఇల్లు కట్టుకొనుటకై ఒక చెట్టుకొమ్మను కొట్టుచున్నాడఁట. వెంటనే ఒక రాజుల కుఱ్ఱవాఁడు వచ్చి అటకాయించెనట. ఎవరు నీవని కొమ్మ కొట్టుచున్న వ్యక్తి ప్రశ్నించెనఁట. ఆ కుఱ్ఱవాఁడు నేను పెన్మెచ్చవారి దౌహిత్రుఁడను అనెనఁట. 'ఓహో ఇక్కడకూడ నీవున్నావా' అని అతఁడు మఱో గ్రామము తరలిపోయెనట.

సారాంశ మేమన, పెనుమెచ్చవారి వంశము అంత తామరతంపరగా ప్రతి గ్రామములో అల్లుకొని యున్నదని.

ఒకప్పుడు పెద్దాపురము సంస్థానాధీశ్వరులైన వత్సవాయి తిమ్మజగపతి మహారాజులుంగారు కాకరపట్టు పదునాలుగువందల మంది సిబ్బందితో రాఁగా వారికి సత్యనారాయణరాజుపూర్వులు మీగడతో విందు చేసిరట. ఆ మహారాజు ఆశ్చర్యపడి 'నారికిడిమిల్లి' అను గ్రామము మొఖాసాగా ఇవ్వగా వీరు రాజు లిచ్చువారే కాని పుచ్చుకొనువారు కారను భావమును తెలుపగా మహారాజు సంతసించి గోభూమిగా కొంత భూమిని విడిచిపుచ్చెను. అది మొన్నటిదాకా వీరి వంశస్థులు అనుభవించుచునే యుండిరి.

పండితరాజు పితామహుఁడు లక్ష్మీపతిరాజు. పితామహి నీలయ్య.

కాంకరపట్టు - పండిత గ్రామము. గోదావరి (వసిష్ఠ) తీరమున నున్నది.

రాజు నాల్గవ తరగతివఱకు శ్రీ పురాణపండ పేరయ్యగారు-సూరయ్యగారు అను వారలయొద్ద చదువుకొని సంస్కృతము - ఆంధ్రము - ఉభయ వ్యాకరణములు మహాకవిపండితులైన చర్ల నారాయణశాస్త్రిగారియొద్ద 'గురుకులవాసము' చేసి చదువుకొనెను. వేంకట రామకృష్ణకవులు, వ్యాకరణాచార్య వేదుల రామశాస్త్రిగారు, చర్ల గణపతిశాస్త్రిగారు, పండిత రాజు సతీర్థ్యులు.

కావ్యములు చదువు రోజులలోనే రాజునకు కవిత్వము చెప్పనేర్పు సహజముగా అలవడినది. ఒక సంక్రాంతి పండుగకు రాజు గురువుగారు నారాయణశాస్త్రిగారు, రామకృష్ణకవులలోని రామకృష్ణమ్మగారు మొదలగు పండితకవులు సరదాగా పేకాడు చున్నారు. అందఱు చక్కని గ్లాసుకోమల్లు క్రొత్తపంచెలు కట్టుకొన్నారు.

రాజులు, కాపులు, కమ్మవారు మొదలగువారు కోడె పందెములు సాగించినారు. అది కాంచి రాజు,

'పేకాటయనివిన్న పేరెముల్ వాఱుచు
బేస్తుమీాద కుదేళ్ళు పెట్టువారు
నేతబట్టలటన్న రోఁత మాకంచును
గ్లాసుకోమల్లులు కట్టువారు
కోడిపందెములన్న కోర్కె మాకంచును
పొరుగూళ్ళకేప్రొద్దు పోవువారు'

అని ఒక పెద్ద సీసమాలిక ఆశువుగా చెప్పెను. గురువు గారగు నారాయణశాస్త్రిగారు రామకృష్ణమ్మగారితో 'రామ కృష్ణమ్మా! కోకిలకు గానము సహజముగా అబ్బినట్లు రాజుకు కవిత్వము సహజముగా అబ్బినదోయి' అని మెచ్చుకొన్నారు.

కలావిలాసినీ సంస్కృత కళాశాలలో జరుగు ప్రతి పరీక్ష లోను రాజు ప్రథమశ్రేణిని జయముగాంచి కుమారసంభవ హితోపదేశాదికావ్యాలు బహుమానముగా పొందెను. రాజుకు 18 ఏండ్లు వచ్చునాటికి తండ్రిచేసిన కృషి అనావృష్టి అతివృష్టు లచే ఫలింపలేదు. పండిన పంటలు తెచ్చి యింటిలోపోసి ధర రాగానే అమ్మకొందమని అనుకొనుచుండగా హఠాత్తుగా ఇల్లు అగ్నికి ఆహుతియయ్యెను. కట్టుగుడ్డలతో సర్వము నాశన మాయెను. ఈ కష్టమునకు సాయము గోరుచుట్టుపై రోకటిపోటు అన్నట్లు రాజు రెండవసోదరి 'నీలయ్యమ్మకి' భర్తృవియోగము కలిగెను. దీనితో రాజు తలిదండ్రులు చాల క్రుంగిపోయినారు. తండ్రికి ఋణబాధ లధిక మయ్యెను. రాజు అన్నదమ్ములు ముగ్గురు. అక్కచెల్లెండ్రు నలుగురు.

నాటకాలు - వ్యాకరణములు (కౌముది-బాలవ్యాకర ణము) చదువుచున్న రాజు, తండ్రి పడుచున్న బాధలు చూచి లోలోన కుమిలిపోవుచు స్తిమితత్వము లేకయుండెను. విదుషీ మణియగు తల్లి రాజుకు ధైర్యము చెప్పుచు చదువుకొనుటకై ప్రోత్సహించు చుండెను. గురువు నారాయణశాస్త్రిగారు ఏమి రాజూ! ఆలా వున్నావు. ఒక్క ఏడాదిపాటు బాగా చదువు. గట్టు ఎక్కుదువు. మహాకవిగా పేరుగాంచెదవు అని ప్రోత్స హించినారు.

రాజు గురువుగారితో

'తాతలు భూమి విప్రుల కుదారత దానము చేసినట్టి వి
ఖ్యాత చరిత్రులయ్య ! కనినయ్యయు అట్టిడమైన నేమి మా
వ్రాతలు దుర్విపాకఫల భాక్కులు కావుట మాన్యమంతయున్
మా తలయెత్తునాఁటికె ఋణంబుల పాలయిపోయె దేశికా !'

అని కన్నులనీళ్ళునించినాఁడు. గురువు ఓదార్చి ధైర్యము చెప్పి వ్యాకరణ రహస్యములు కవితారహస్యములు విప్పిచెప్పి తనంతటివానినిగా రాజును తీర్చి దిద్దెను.

అంతలో 1920వ సంవత్సరము జూలై నెలలో గుడివాడ హైస్కూలునకు తెలుఁగు పండితుఁడు కావలెనని ఆంధ్రపత్రికలో ప్రకటన చేయఁబడెను. ఆ ఉద్యోగమిచ్చు అధికారి బండి శ్రీహరిరావు నాయుడు (డిప్యూటీ కలెక్టరు). ఆ ప్రకటన చూచి రాజును పిలిచి గురువుగారగు నారాయణశాస్త్రిగారు రాకపోకలకు పదిరూపాయ లిచ్చి గుడివాడ వెళ్ళి అధికారిని చూచిరమ్మనినారు. రాజు గుడివాడవెళ్ళి శ్రీహరిరావు నాయఁడు గారిని దర్శించి –

'ఓ కరుణాతరంగ కలితోదధి ! దీనదయాళు శేవధీ !
కాఁకరపఱ్ఱు నాఁగ నొక గ్రామము రాజిలుచుండు తఱ్ఱ తా
లూకున పండిత ప్రతతులున్ గలరందు, ద్వితీయ కాశి నాఁ
జేసుతె దాన నొక్క ప్రథ చెప్పక చెప్పెడు చూచువారికిన్.'

* *

మాకు నివాస మయ్యది శ్రమంబొనరించితి సంస్కృతాంధ్ర భా
షా కలనంబునం దుభయశాస్త్రములందును కొంత కొంతగా

సాకతమైన చర్ల కులచంద్రునితోడ, మదీయ గ్రామమం
దే కులమందు క్షత్రియుఁడ నేనిట యున్నత పాఠశాలలో
తేకువ నిర్వహించెద సుధీపద మార్గరునిచ్చి పంపవే
ప్రాకట సత్కవీంద్ర పరిపాలక శ్రీహరిరావు నాయకా!

*　　　　*

అని దరఖాస్తు వ్రాసి పఠించి యిచ్చెను. శ్రీహరిరావు నాయఁడుగారు ఆ పద్యము లాలించి ఆనందించి గుడివాడ హైస్కూలులో జూనియరు తెలుఁగు పండితుఁడుగా నెలకు పదునైదు రూపాయల జీతముపై నియమించినారు. ఆర్డరు తీసికొని శాకరపల్లువచ్చి పూజ్యపాదులగు గురువులకు మ్రొక్కి తలిదండ్రులకు నమస్కరించి నాయనమ్మకు వినతుఁడై మరలి వచ్చి 1920 ఆగష్టు 2 వ తేదిని గుడివాడ హైస్కూలులో చేరెను.

చేరిననాఁడె రాజు మూఁడవ ఫారములో పాఠము చెప్పు చుండగా హెడ్మాష్టరు క్లాసులోనికి వచ్చి

"హితుఁడవు చతురవచోనిధి
వతుల పురాణాగమేతిహాస కథార్థ
స్మృతియుతుఁడవు - అను పద్యముయొక్క అర్థము విని - స్మృతి - జ్ఞాపకముతో - యుతుఁడవు - కూడికొన్న వాఁడవు - అని రాజు చెప్పిన అర్థము సరికాదని 'స్మృతి - స్మృతులతో - అని చెప్పవలెనని వాదించి, పండితుల నందరిని రావించి అడిగెను. అందఱు రాజుచెప్పినదే సరియనిరి. అంతతో ఆఁగక వావిళ్ళ - ఆనంద - ప్రెస్సులవారి మనుచరిత్ర వ్యాఖ్యా

నములను తెప్పించి చూచి రాజు చెప్పినట్లే యుండుటచే శాంతించి వెడలిపోయెను. దానితో రాజుపేరు గుడివాడ హైస్కూలులో ప్రమోగిపోయెను. మఱి హెడ్మాష్టరు రాజు క్లాసున కెన్నడు వెళ్ళలేదు.

హైస్కూలులోచేరి రాజు పూటకూళ్ళిండ్లం గడపుచు కాలము పుచ్చుచుండెను.

ఒకనాడు రాజు తన సహోపాధ్యాయు లొకరితో కలిసి గుడివాడ సీమకు తలమానికమై వెలయుచున్న అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారి మేడకు వెళ్ళుట తటస్థపడెను. గోపాల కృష్ణయ్యగారు రాజు పుట్టుపూర్వోత్తరములను తెలిసికొని తన మేడమీదికి వచ్చి ఉండుమని ఆహ్వానించెను. రాజు తన మకామును పూటకూటింటినుండి అడుసుమిల్లివారి మేడపైకి మార్చెను. అచ్చట తీరికసమయములలో శ్రీ గోపాలకృష్ణయ్య గారిపెద్దకుమార్తె శ్రీమతి దుర్గాంబగారికి సంస్కృతాంధ్రములు చెప్పదొడంగెను. తరువాత దుర్గాంబామతల్లి శ్రీ వెలగపూడి రామకృష్ణ ఐ. సి. యస్. గారికి అర్ధాంగి అయ్యెను.

హైస్కూలులో రాజు మోహనాకారుడై మధుర కంఠముతో పద్యాలు చదివి చెప్పుట, ఆశుకవిత్వములు అల్లుట అవధానములు చేయుట మొదలిడెను. పిల్లలందఱు రాజును బ్రహ్మరథము పట్టసాగిరి. ఎందఱో రాజుశిష్యులు కవులైరి. రాజు జీతము 15 నుండి 25 కు పెరిగినది. నాటి రాజు తీరు తియ్యము లిట్లుండెను.

"తరుణ శశాంకమండల నిధానమనందగు నిండు మోముతో
అరవిరి మల్లెపూల నపహాసము చేసెడు సుస్మితంబుతో
వరిమడి నారుపోసినటు వచ్చుచునుండిన మీసకట్టుతో
సరిగ గులాబిరంగుల పసందులఁ జెందెడు కోరచాగతో
విరిసిన బంతిపూవులటు వెల్గుచునుండిన సిల్కుకోటుతో
సురుచిర సుభ్రదీధితుల చుంగులు వాలెడు పంచెకట్టుతో
ఇరువదియేండ్ల ప్రాయమున నీ గుడివాడకు తెల్గుటొజ్జగా
అరుసముతోడవచ్చి మురియంగను జేసెను శిష్యజాలమున్.

*   *

కళలెపెను సత్కవిత్వమునఁ గావ్యములల్లుట శిష్యకోటికిన్
గలిపినవారిలోఁ బ్రతిభ గాంచిరి వేంకటరత్నమున్ సుధీ
వరులగునట్టి సూరిభగవంతము నారల వేంకటేశ్వరుల్"

ఇది నాఁటి శిష్యుల హృదయములకు అత్తుకొనిపోయిన రాజు చిత్రప్రతిభ.

1922 ఎ. రామారావు అను ఒక డి. ఇ. ఒ. రాజు క్లాసునకు వచ్చెను ఆయన పాశ్చాత్య దేశాలలో విద్య నభ్యసించిన రసికాగ్రగణ్యుఁడు. మూఁడవఫారము విద్యార్థులచేత నే రాజు పద్యాలలో కాంపోజిషను వ్రాయించుట చూచి ఆశ్చర్య చకితుఁ డాయెను. ఉపాధ్యాయులతో డి. ఇ. ఒ. సభ తీర్చెను. రాజును ఆశువుగా పద్యాలు చెప్పుమని హెడ్మాష్టరు ప్రోత్సహించెను. రాజు నాఁటి పండితుల స్థితినిగూర్చి ఇరువది పాదములుగల ఒక ఉత్పలమాలిక చెప్పెను అందలి కొన్ని పంక్తులిందు పొందుపఱచు చున్నాము.

మెత్తని వారమయ్యా మము మేలగు శాల్వాలు పట్టుపుట్టముల్
చిత్తమెలర్ప నిచ్చి సరిచేయుట కేనియు డీ. పి. డబ్లువోల్
సత్తువశాఖవారలము సారసనేత్రుఁడ కాకపోవుటన్
సొత్తుల నిచ్చువారలిటఁ జూపు మనుందురు తొంటచేతులన్
బత్తెము చాలకుంటఁ దన భార్యను బుట్టినయింట నుంచఁగా
అత్తయుమామయుం గరము నాఁటసిచేయుచు దిక్కుమాలి సం
బంధము దాపురించెనని పల్కుచునుందురు రంతెకాదు పో
కొందరు - ఇర్గు పొర్గులట కొంకును జంకును లేక అమ్మకల్
పెందలకడలేచి తమ పేరిమికత్తెలఁగాంచి 'వింటివే
సుందరి వారి అల్లుఁడట స్కూలున మాష్టరటే మతేమిటే
బొందియు నల్లపూస యిడిపోయెను మూఁడునుగాదు నాలుగో
వందల యుత్తరాలిడిన వచ్చి కళావతి చూచిపోదె యే
మందల మమ్మయని యాదర మొప్పఁగఁ జెప్పుకొంద్రు మా
అందముచందమున్ బళిర ! యద్దిర ! యిద్దియ రామరాయఁడా!

* *

సంగర శక్తిలేదు వ్యవసాయము చేయఁగ భూమిలేదు సంతలో
అంగడిపెట్టి యమ్ముటది యంతకుమున్నె హుళక్కి, పొత్తకాల్
రంగున వ్రాతమన్నను సరాసరి కాగితపున్ వ్యయంబుకే
టెంగులు చాలవయ్యా యొకటే యిఁక నుండెగదయ్యా యేమనన్
బొంగు భుజాన వేసికొని పోవుటయే యది పోయెపో
మంగళసూత్రధారణము మానుఁగ జేసిన అర్ధదేహ నే
గంగను గల్పనయ్యా అదికాదు సతీసహితం బటందువో
ముంగలఁ జెప్ప మర్చితిని మూగురు వృద్ధులు గల్గియుంట యీ
బెంగలుతీర్ప మీపయినె పెట్టితినయ్యా సమస్త భారముల్.

ఇది విని డి. ఇ. ఒ. కరఁగి నీరై ఎంతో మెచ్చుకొని జీతము హెచ్చించు అధికారము తనచేత లేదని వగచి స్కూలు ఫైనలు పరీక్షకు అసిస్టెంటు ఎగ్జామినరుగా నియమింపచేసి యార్థికసాహాయ్యము చేసెను.

ఆశుకవితలచే - అవధానములచే - రాజు గుడివాడలో ఆబాలగోపాలముచేత కీర్తింపబడుచుండెను. డాక్టరు నండూరి శివరావు, జంధ్యాల శివన్నశాస్త్రి మొదలగు కవిపండితులు రాజుగారి ప్రతిభా వ్యుత్పత్తులతోడి కవిత్వశక్తిని మెచ్చుకొని ప్రోత్సహింప సాగిరి.

గుడివాడలో ఉండగానే రాజు చంపకమాలినీ పరిణయము అను అచ్చతెలుఁగు ప్రబంధము అర్థానుస్వార శకట రేఫచంద్రికవ్రాసి ప్రకటించెను. అచ్చతెలుఁగులో ఇంత ముచ్చటగా మాఱుమూల పదములు ప్రయోగింపకుండ వ్రాసిన కావ్యము లేదని కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారు మున్నగువారు మెచ్చుకొనిరి. మచ్చున కొకటిరెండు పద్యాలు-

'కోరిక న్నాప్రోలంగల
వారువములతోడ లేళ్లు పందెమ్మిడి వే
పాఱఁగ నోడుటగాదే
కాగాకులఁదినుచుఁ దిరుగుఁ గానలవెంటన్.

ఎండల్ మెండుగఁ గాయగాఁదొడఁగె మిాయిల్లాండ్రుపెన్ బాళియై
నొండేకర్జములూనకే దిగులుతో నున్నారు మిమ్మారయన్
పొండోహోయని బాటసారులను వేపుత్తెంచులా గొప్పుఁగన్
గండుంగోయిల లెల్లమూలల నహో గద్దించుచున్ గూసెడున్.

1920 ఆగష్టు 2 వ తేదీనుండి - 1924 ఏప్రియలు 17 వ తేదీదాఁక గుడివాడ హైస్కూలులో తెలుఁగు పండితుఁడుగా ఉన్న రాజు తణుకు హైస్కూలునకు బదిలీయై 18 వ తేదిని తణుకు హైస్కూలులో ప్రవేశించెను. "గుడివాడా యింక నీకు గుడ్ బై గుడ్ బై" అని గుడివాడవీడి వచ్చునాఁడు శ్రీ రాజు గారికి సన్మానము ఆనాఁటి గవర్నరులకుఁగూడ జరుగ లేదనుట సత్యదూరముగాదు.

అప్పటికే రాజు వ్రాసిన అనేక సారస్వత వ్యాసములు, పద్యములు - శారద, కృష్ణాపత్త్రిక, ఆంధ్రపత్త్రిక మొదలగు వానిలో ప్రకటితములైనవి. రాజుపేరు తెలుఁగునేల నలుచెఱం గుల వ్యాపించెను.

తణుకుహైస్కూలులో రాజు సీనియర్ తెలుఁగుపండితు డైనాఁడు. భారతి మున్నగు పత్త్రికలకు అనేక సాహిత్య వ్యాసాలు వ్రాయుటతో పాటు అనేక గద్య పద్య కావ్యాలు - అలంకారశాస్త్రాలు వ్యాకరణములు శతకములు - ద్విపద కావ్యములు, ఖండకావ్యములు వ్రాసెను. వీధిబడిలో చదువు మొదటితరగతి విద్యార్థులు మొదలు విద్వాన్ విద్యార్థులవఱకు రాజు రచనలు పఠనీయములైనవి.

హరిజన దేవాలయ ప్రవేశమునుగూర్చి రాజు వ్రాసిన 'ఆరాధన' కావ్యమునకు పీఠిక వ్రాయుచు నార్ల వేంకటేశ్వర రావుగారు

"పండిత శ్రీ సత్యనారాయణరాజుగారు నాకు చిన్ననాటి గురువు. వారి శిష్యకోటిలో నే నొకడను. గురువుగారి కావ్యా

నికి శిష్యుడు పీఠిక వ్రాయడం లోకవిరుద్ధమైనా నన్నీకార్యానికి నియోగించడం ఆయన శిష్యవాత్సల్యానికి తార్కాణం. నే నిందుకు సాహసించడం కేవలం నా గురుభక్తి ప్రాబల్య ప్రేరేపణతోనే.

పాఠాలుచెప్పి పరీక్షలు ప్యాసుచేయిస్తూనే దేశభక్తిని, ప్రగతిశీలాన్ని నూరిపోయగలవారు బహు కొద్దిమంది. అట్టి వారిలో ఎన్నదగినవారు మా గురువుగారు. చిన్నయసూరి వ్యాకరణ సూత్రాలను విశదీకరిస్తున్నా ఆయన దేశభక్తిని ప్రేరేపించగలరు. ప్రగతిదృష్టిని పెంపొందించగలరు. అందువల్లే ఆయన ప్రతికావ్యం నిష్కళంక దేశభక్తికి కర్పూర నీరాజనం. నిరంతర ప్రగతిమార్గానికి జాజ్వల్యమాన కరదీపిక.

కలాన్నిబట్టినా మా గురువుగారు కర్రును మూలపడ వేయలేదు. ఆయన పండిత రాజు మాత్రమేకాదు. పండిత రైతు కూడా.

అందువల్లే సాహిత్యరంగంలో పండితుని ప్రాగల్భ్యంతో పాటు జీవితరంగంలో కర్షకుని సన్నిహితత్వాన్ని కూడ ఆయన ప్రదర్శించగలరు. అవసరంవస్తే ఆయన కత్తిపట్టగల ధీరులు కూడా.

కలంపోటు, కర్రుబడుపు, కత్తిపదను వీటి సమ్మిశ్రమమే ఈ ఆరాధన.

ఇంతేకాదు. పాతక్రొత్తల మేలు కలయికలనుకూడా వీరి కావ్యంలో చూడవచ్చును. మూస పాతది. దానిలో పోయ బడ్డ లోహం కొత్తది. కథాసంవిధానం పాతది. కథ ద్వారా

చాటబడిన సందేశం క్రొత్తది. ఈ వైశిష్ట్యం శైలిలోనైతం ప్రస్ఫుట మౌతున్నది. అంతలో సంస్కృతపు జిగి. అంతలో తెలుఁగు తియ్యదనం. అంతలో ప్రబంధప్రౌఢిమ. అంతలో నవ కవితా లాలిత్యం.

వీరి కృతులన్నీ ఆధునిక సాంఘిక వైజ్ఞానిక రాజకీయ మతాది సమస్త విషయములను రసవత్తరంగా లోకానికి అందిస్తాయి."

కావ్యములు చదువునాడె నవ్యకవిత్వము వ్రాయుట నేర్చిన రాజు

చంటిబిడ్డలు దొరకొని శాస్త్రవేత్త
లందఱునుగూడఁ జదువఁగా సర్వమైన
పద్య గద్య ప్రబంధముల్ వ్రాసివ్రాసి
ప్రజల విజ్ఞానదీప్తికై పాటుపడితి
చిత్తు సాఫును వ్రాఁత నా చేత గాదు
తలఁపు కలిగిన వెంటనే కలముతీసి
గద్య పద్యాత్మకములైన కావ్యములను
వడిగ వ్రాయుట నాకు స్వాభావికంబు.

అని వ్రాసికొనుటలో తప్పేమి, ఒప్పేయఁగును. అని వారి కావ్యములలోని ధారాశుద్ధి కాంచినవారికి తోచకమానదు.

ఆరాధన

'అభినవములగు భావములనువుపఱచి
నవరసంబులు చిప్పిలునట్లుగాఁగ
తెలుఁగుదన ముట్టిపడునట్లు..... వ్రాసిన

ఈ పద్యములు గాంచుడు.

పార్వతీపరమేశ్వరులు నందివాహనముపై ఎక్కిరి. నంది

ఎక్కినఁ దొక్కటుల్ పడక యించుక తోఁకను త్రిప్పి యెత్తి మై
నిక్కఁగ వీనురిక్కఁగ ఖణిల్లని అంకియ వెట్టి కొమ్ములన్
ద్రొక్కకు నెట్టి జిల్గు మెడపట్టెడ మువ్వలు ఘల్లుఘల్లనన్
రిక్కల దారిలో మెఱుపు రేకొనునట్లు దువాళి వాఱుచున్.

పోయిపోయి హరిద్వారము చేరినది. అచ్చట శర్వాణీ

శ్వరులు

రంగత్పన్నగ రాజరాజితమణి గ్రైవేయ హారాళితో
లింగాకారమునన్ వసించు నెడ నిర్లిప్తాంతరంగుల్ రజో
లింగుల్సంగ విభంగ చంగులు సమాశ్లిష్టాప వర్గాంగనా
సంగుల్ శైవవిధాన పంగులు"

వారిని సేవించిరి. అచ్చట 'అవగింజలువోని అక్షి

యుగ్మమువాఁడు, మొఱకు దేఱిన పాదుమోమువాఁడు – పాచి
కంపునుఁగొట్టు పలుచాలుగలవాఁడు – వ్రేలాడు పెనుతొట్ట పెదవి
వాడు.....చీముగాఱెడు దొప్ప చెవులవాఁడు, గడ్డిమోపును
బోలు మడ్డిదేహమువాఁడు.....అయిన బ్రహ్మబంధుడు వారికి
పూజారియై దాపురించినాఁడు. రామశబ్దంబైన రానట్టి యతఁడు
ఒక పంచమ భక్తుని గుడిలోనికి రారాదని ఆటంకపఱచినాఁడు–
హరిజనుఁడు

ఎవ్వఁడజాతశత్రుఁడు నిరీహుఁడహంకృతిదూరుఁ డాతఁడే
సువ్వె మనీషి బ్రాహ్మణుఁడు.....మేనొక బుద్బుదంబుపగిది

విధ్వస్తమౌను 'గుణ్యుండగు వానికేటికిం గౌలముగోల' 'జీవున కెపుడున్ చావును పుట్టువు కలుగవు'......అక్రోధుండె బ్రాహ్మణుండగు, సక్రోధుండగును జూవె చండాలుండు - క్షమయే మోక్షము - స్వర్గము - ఈశ్వరేశ్వరు తనయుల మెల్లరమును. తండ్రి సేవింపరానట్టి తనయుడున్నె! ఎఱుంగ జెప్పుమది యదక్షిణమేని, తెలిసికొందును పూజరీ! కలనిజంబు - అని నిలువం బెట్టి యడిగెను. పూజారి కోపించి దుద్దుకఱ్ఱతో, భల్లున వాని మూర్ధమును బ్రద్దలువాఱంగం గొట్టినంతటన - మాలండు - నెత్తురు కాఱు తలతో ప్రక్కకు వ్రాలెను. శివలింగమును నెత్తురు కాఱుచు వ్రాలెను. భక్తుడు తన తలపెంకుతీసి ఈశ్వరలింగము తల కతుకంబోయెను. 'అర్థేందుమౌళితో, ఆకాశ గంగతో, ......ఘనఫణి గ్రైవేయకంబుతోడ లింగమునుండి వెలువడి లేచి నిలిచి, ఈశ్వరేశ్వరుండైన గౌరీశ్వరుండు, మందహాసము మోమునం జిందులాడ అభయ హస్తంబుతోడం బ్రత్యక్షమయ్యెను. పూజారి భక్తుని క్షమార్పణ వేండెను. శివుండు పూజారిని నాస్తికునిగా జన్మించుమని శపించెను. ఈ ఇతివృత్తము గల ఆరాధన మహోదాత్తమైన శైలిలో వేదాంతసారగ్రంథమై విలసిల్లినది. పాండిత్యమునకు కవిత్వమునకు వ్యాకరణ పరిజ్ఞానమునకు ఇది యొక గీటురాయియై విలసిల్లినది.

ఆరాధననుగాంచి ఆనందించిన పాఠకుండు కవిత్రయా వేదన పఠించినచో బాహ్యప్రపంచమే మఱచిపోవును. కవిత్రయమే పండిత రాజుగా అవతరించెనా? అని ప్రతివాండు తలంప వలసినదే.

నన్నయ అనుచున్నాడు తిక్కనతో

నిండుమనంబు నవ్యనవనీత సమంబుగఁ గావ్యకల్పనా
ఖండ తపోవిభూతిమెయిఁ గాల్పనికంబులు బౌద్ధ జైన ధ
ర్మ్మండలి బోధముల్ తెగడి వ్రాసితిఁ బంచమ వేదమంచు రా
ణ్మండలి దండిగా పొగడ మానిత భారత సంహితార్థమున్
ఉదయాస్తాచల సేతుశీతనగ మధ్యోర్వీపతుల్ తారు నా
పదలాలిత్య సమాసశయ్యలకు పూర్వానందముం జెందుచున్
మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం
పద లోలిం గొని తెచ్చి యిచ్చి ముద మొప్పంగాంచి లాలింపరే.

ఇట్టి నా కవిత్వమును భావకవులు కాదనువారా?

కాదనకిట్టిపాటి అపకావ్యవిభావ కవిత్వవేదులకు
యతులూ ప్రాసములుండిన
గతికిని లోపంబు లొదవఁగలవటె యిఁక ని
ర్యతిప్రాసముగ రస మొలుకఁ
గతలల్లెదరట్టె భావకవు లెల్లెడలన్

శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువుఁబగిలి
ఆజ్యహావిర్ధూతపూజ్య సౌరభధూమ
వల్లికాతతుల రూపముల నెఱిఁగి
చూచి యాఁడలేమి నేచి తనర్చి త
లిర్చిన క్రోవులలీనతఁగని
అతిరుచిరాగతమైన శీతలవాత
పోతము లాగిపోదు ముట్టనాని

మనము సలిపిన సృష్టివర్ణనముపట్ల
వళులు గణములును రసప్రవాహమునకు
నేమి యడ్డులుగూర్చెనో యెఱుఁగమైతి
మనుడుఁ గొండొక సేపు తా నట్టుచూచి

* *

చిడిముడిపడి యప్పలుకుల
కెడఁగలకోపంబు నాఁగ కెర్దెడు కవితా
జడమతి తిక్కన వలికెన్
నడయాడు మగఁటిమతోను నన్నయభట్టున్

వదాజ్ఞాదృఢబంధ సంయమిత శుంభద్వేగమైకాక నేఁ
వలీలం దమ తిక్కనద్విపము క్రోధావేశ దుర్దాంత ద
ృవిలాసోద్భటభంగి నేపడరి దుర్భావాంబుజశ్రేణిఁ జి
కవడం జేయదె యొక్క వ్రేల్మిడినమీకున్ వేడ్కసంధిల్లఁగన్

ల్లంబుగాదె మీకెల్లను గుకవులు
సెడు కుటిల విచేష్టితమ్ము
టటు నాతో మీరు నాంధ్రాన నిడుమలఁ
ందితి రోకభంగిఁ బోయెఁగాల
ది భావ కవికాలము........తెలుగును కేవల క్రోధులై
ఋపన వేతురు.

డకు వానకోర్చి తనయిల్లు ప్రవాసపుఁజోటునాక ఆ
ండు నలంగుదున్ నిదురకుం దఱితప్పెడు డప్పిపుట్టె నో
ండన యెట్లొకో యనక కల్పనచేసితి భారతంబు నా
సినపంట నేటికి అభావ కవీశులచేతఁ జెల్లెసిన్.

అజ్ఞులు కొందఱిప్పు డపహాసము చేయుచు భారతంబు భా
షాజ్ఞత లేమి నెవ్వియొ విచార విదూర విమర్శలేశముల్
ప్రాజ్ఞులు నవ్వఁజేయుటకుఁ బాల్పడుచుండ సహించి యుందునే
ప్రజ్ఞలుసూపి వారి పనిపట్టక ముట్టక మిన్న క్రేల్మిడిన్.

అని భావకవుల నిరాకరించి 'అనువాదంబన మూ
భారతకథా వ్యాఖ్యాన మాత్రంబుగా, బొనుసారన్ వలెఁగాని
నీరసకథాపుంజంబె చందంబుగా బొనరింపం బనిపూను టొక్క
బళిరే పుంభావవాగ్దేవతల్, కన నిన్నాళ్ళకు భారతంబు తెనుగు
గావించి రున్నట్టుగా అని నవీన భారతాంధ్రీకరణ కర్తల ని
సించి, యెఱ్ఱనతోఁగూడి కవిత్రయమువారు మనుష్యాకారులై
పిఠాపురాధీశ్వరులైన శ్రీ సూర్యరాయమహారాజును, జయపుర
ధీశ్వరులైన శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారిని, శ్రీ కా
నాథుని నాగేశ్వరరావుగారిని దర్శించి నేటి యాంధ్రభాష
దుస్థితిని వివరింపగా వారు గ్రాంధిక భాషోద్ధరణమునకై బద్ధ
కంకణు లయ్యెదరు.

ఈ కవిత్రయావేదన శ్రీ విక్రమదేవవర్మ జయపుర మహా
రాజావారి అధ్యక్షమున జరుపబడిన 'భారతీ తీర్థ' వార్షిక
సభలోఁ జదువఁబడెను. ఆ సభను, వఝ్ఝల చిన సీతారామ
స్వామిగారు, శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు, శ్రీ సెట్టి
లక్ష్మీనరసింహముగారు, మున్నగు మహా పండితకవులు వెయ్యి
మంది అలంకరించియున్నారు.

పండిత రాజుగారు 'కనితే వినితే తిక్కనార్య' అని
చదువఁగానే వత్సవాయి నీలాద్రిరాజుగారు - అనువాదు అది

్రయ ప్రయోగమా ? అని ప్రశ్నించినారు. పండిత రాజు
రు ఔనని సవినయముగా చెప్పినారు. కాదని ఆయన వాదించి
రు. మహారాజావారు, సెట్టివారుకూడ కవిత్రయ ప్రయోగమే
న్నారు. అది అవునా కాదా అని చెలరేగి గిడుగు రామ
మూర్తిగారికి 'రిఫర్' చేసినారు. ఆయన ఉగ్రులై ఎవరు కవి
యి ప్రయోగము కాదన్నవారు తిక్కనని నిర్వచనోత్తర
రామాయణములో ఉన్నదీ ప్రయోగ మన్నారు. సభలో పండిత
రాజుగారికి అఖండవిజయము-పాపము ఎదిరి ప్రచ్ఛకునకు......
ంపు గలిగినది. శ్రీ విక్రమదేవవర్మగారు మెచ్చుకొని 'కవితా
శారద' అను బిరుదు ఆ సభాముఖమున పండిత రాజుగారికి
చ్చినారు.

ఇట్టి మహత్తరకావ్యము వ్రాసిన కవిరాజు విజయశ్రీ
కను కావ్యము వ్రాసి భారతీయులను ఆత్మదేశరక్షణకై
ురికొల్పెను.

ఇందలి యితివృత్తము ఒక పేదరాలు తన కొడుకునకు
నానాకష్టాలుపడి స్కూలుఫైనలువఱకు చదివించి యేదైన
కొకరీ సంపాదించుకొనుమనెను. వాఁడు పోయి యుద్ధచిత్రము
నుచూపు సినీమాచూచి ఉప్పొంగి టెక్నీషియనుగా రిక్రూటై
కుదకు పెద్ద ఇంజనీరై విమానాలు, ట్రాక్టరులు మొదలైనవి
ర్మించి దేశోద్ధారకుఁ డయ్యెను.

ఆ పేదరాలు కొడుకును గాంచి

గరగరనైన వంటకము కమ్మని కూరలు ఊరుగాయలున్
పెరుఁగును పాలునున్ కడుపునిండుగ నీకిడుకాల మెన్నఁడేన్

దొరకున ? నాయనా ! చినుఁగుధోవతియే ధరియించి వీధిలో
తిరిగెదు నిన్నుఁగాంచ మది నీరయి పాఱెడు నాకు మాటికిన్

అమ్మన రోఁకలి కట్టుక
క్రుమ్మరి యిల్లిల్లు దంచి కొలుచులు నీకే
నిమ్మయి నాలుగు ముక్కలు
నమ్మికఁ జెప్పించినాను......

లేమికిని చావునకు భేదమేమి లేదు. ఏదైన నౌకరీ సంపా
దించుకో అన్నది. అతఁడు బయలుదేఱి పోయి

'యుద్ధ చిత్రంబులను జూపుచున్నయట్టి
యొక్క మాజిక్కులాంతరు ప్రక్కఁజేరి
నిలువఁగాబడి తెఱమీఁదఁ బలువిధాలఁ
గానఁగాఁబడు బొమ్మలఁ గాంచుచుండ.

చటులోద్భూత ఛటచ్ఛటార్భటి నభోజ్యామార్గరోధమ్ముగా
పటు ధూమ్రాగ్ని శతఘ్ని దాణ్ముఖపరీవాహమ్ము లాశాంతభూ
తట భాగంబులు క్రమ్మిపాఱఁ బయిపైఁ దండోపతండంబులై
రట దాకాశ విమానరాజిమిణుఁగుల్ రాల్పం గ్రుధాక్రుద్ధ్వనిన్
చూచి

మొగము విప్పారఁ దెగువ పెన్ బిగువు దేఱఁ
దలఁపు లిగురొత్త మేనెల్లఁ బులకలెత్తఁ
బిక్కబిగియెక్క రోమముల్ చక్కనిక్కఁ
బెదవు లదరంగ భుజములు పొదలిపొంగ

రిక్రూటింగు ఆఫీసరువద్దకేగి మొదట పైలట్టుగాచేరి,
అందుండి యంత్రాగారమునఁ బ్రవేశించి యింజనీరై 'లీల

అను రిక్రూటింగు ఆఫీసరు లైపిష్టును పరిణయమాడి సిరిసంపద లతో దేశమును తులతూగఁజేసి సుఖముండుదును. విజయశ్రీ వ్రాసిన పండిత రాజు కలమునుండి వెలువడిన పండిత రాజ చాటువులు జగన్నాధ పండిత రాజు చాటువుల కనువాదములు గాక స్వోపజ్ఞమూలకములై విలసిల్లుచున్నవి - వడ్డీవ్యాపారుల గూర్చిన యీ చాటువు తిలకింపుడు. తాటిచెట్టుపై అన్యాప దేశముగా చెప్పినది.

నిలువగ నీడ లేదు శయనింపఁగ సెజ్జయు లేదు కట్టఁగా
వలువలు లేవు చేత నొకపైసయు నేనియు లేదు గాదెలన్
కొలుచులు లేవు నీరసము క్రోలెడివారికి తాళవృక్షమా
కులికెద వేల యిట్లు తడిగుడ్డల గొంతులుగోసి లీలగా.

కొంపలగూల్చు ధనికులనుగూర్చి చిలుకపై చెప్పిన యీ పద్యము పరికింపు డెంతటి మనోహరమైన వ్యంగ్యమో !

పచ్చగ ఉన్నవాఁడవని పల్కులఁ తేనియ లొల్కువాఁడవం
చచ్చపు రాగముంగురియు ఆస్యము కల్గినవాఁడవంచు ని
న్నిచ్చఁదలంచి మెచ్చుకొని రింతియకాని యొకండు నేనియున్
త్వచ్చరితంబు సర్వఫల భంగకరంబని యెంచడో శుకా !

వ్యంగ్యప్రధానమైన ఉత్తమ కావ్యలక్షణమును పుణికి పుచ్చుకున్న వీరి కవిత రసాలములోని - ప్రసవపావము స్త్రీలు పూలు - ఆంధ్రౌన్నత్యము - గ్రహణ మోక్షములు అను శీర్షికలుగల ఖండ కావ్యములలోఁ గూడ ప్రస్ఫుట మగును. 'అంకితము' అను ఖండకావ్యము నన్నియ కవితాసరణిపై చేసిన చక్కని విమర్శాత్మక రచన. విప్రలబ్ధ, యమునాప్రాభవ

స్మృతి - భక్తి ప్రేరకములు - కమ్మరీడు - యుద్ధముల నిరసించి శాంతి నాకాంక్షించును - 'ఉల్లికోళ్లు' కరుణారసపూరితమగు పేదరాలగు హరిజనస్త్రీ దారిద్ర్యగాథ. పనిలేక పేదరాలైన హరిజనస్త్రీ పస్తుండగా ఒకరైతు ఉల్లికాడలిచ్చి - అమ్ముకోమన్నాడు. అవి తీసికొని ఆమె వీధివీధి తిరిగినది.

ముదురుకోళ్ళని యొకతల్లి మూతివిఱిచె
ఎండుకోళ్ళని యొకతండ్రి యీసడించె
పాడుకోళ్ళని యొకయన్న చూడడయ్యె
వెధవకోళ్ళని యొకయక్క విసరికొట్టె.

చాకిరీచేసైన సాకుదు నందునా
అస్పృశ్యతాదోష మడ్డుతగులు
వడ్లు దంచైనను బ్రతికింతునందునా
మఱవచ్చి మానోళ్ళ మట్టిగొట్టె........
ఎట్లు బిడ్డల పోషింతు నేమిసేతు

దారి కనరాదు తుదకు గోదారె దిక్కు - అని ఆమె దీనయై వాపోవును - రసాలమునిండ ఇట్టి వెన్నియో ఖండకావ్యములు కలవు.

ఇన్ని కావ్యములు - ఖండకావ్యములు వ్రాసిన కవిరాజు శ్రీనాథునివలె రామకృష్ణము అను ద్విపదకావ్యము శ్రీ వెలగపూడి రామకృష్ణగారి జీవితచరిత్రను చిత్రించి రచించి శ్రీవిక్రమదేవవర్మగారికి అంకితమిచ్చి - కవిరాజు బిరుదమును, నూఱెకరాలు భూమి, ఒక మేడ పారితోషికముగా వడసెను. మచ్చునకు అందలి పది పాదాలు రామకృష్ణ రూపురేకలు

హాటకపు సలాకయా నంగయష్టి
అతి నిర్మలానందమైనట్టి దృష్టి
పూర్ణిమాచంద్రునిబోలు నెమ్మోము
వెన్నెలన్ వడఁదాకు పెనుపైన గోము
సిరి గ్రొమ్ములుక్కుచుండెడు చిన్నారినవ్వు
చీకట్లు క్రమ్మెడు చిప్పకూఁకట్లు
వదులుగా కట్టిన బలు పంచెకట్టు కలిగి

శ్రీరామకృష్ణ విద్యాభ్యాసము చేసెను. రామకృష్ణగారు జయపూరు దివానుగా ఉండఁగా 1929 లో శ్రీ రాజుగారికి అప్పటి మహారాజగు శ్రీరామచంద్రదేవు మహారాజుకుఁ జెప్పి ఇంద్రావతీనది చెంతఁగల ఆసనా అను నూర నూటెకరాల భూమి, యిల్లు, వాకిలి ఇచ్చి మైత్రి నెఱపెను. ఆ భూమి - యిల్లు - వాకిలి రాజుగారు తన సోదరుల కిచ్చివేసెను.

ద్విపదను ఇరువది మూఁడుసులుగా చదివి రాజు సభ్యులను రంజింపఁజేయును.

కావ్యకవిత్వముతో పాటు వీరి శతక కవిత్వముకూడ విశ్వజనీనమై వెలసినది.

దక్షారామ భీమేశ్వర శతకములో

చొక్కంబౌనట నాంతమందు అ-ఇ-ఉణ్ సూత్రంబులన్ బల్కునీ
ఢక్కానాదములాలకించి మెయిఁబుల్కల్ హెచ్చగా వ్యాకృతిన్
చక్కన్ వ్రాసినయట్టి పాణినసుతుండన్ గాను కాఁబట్టి స
మ్యక్కావ్యంబు లొనర్చు శక్తియిడు దక్షారామ భీమేశ్వరా!

అని ప్రార్థించి

వారస్త్రీణము నృత్యమున్ సలుపఁగా వర్ణింపఁగా సత్కవుల్
పౌరస్త్రీలు నివాళులీయఁగ ననమోకంబులీ భక్తులున్
హోరాటంబుగ డంబుగా హాయలుగా ఊరేఁగుత్వన్మూర్తికిన్
ఆరాధించి ప్రదక్షిణించెదను దక్షారామ భీమేశ్వరా !

అని ప్రపత్తి ప్రకటించుకొనును. విక్రమదేవ శతకమునందు

తనకున్నది పదిమందికి
తనియంగాఁ బంచియిచ్చి తనిసినవాఁడే
ధనవంతులందు ధన్యుఁడు......విక్రమదేవా ! అనును.

అంతేకాదు

అన్నమునకు అల్లాడెడు
పిన్నలఁ బెద్దలనుగాంచి పెంచెడు నదియే
యెన్నఁబడు దొరతనంబని......విక్రమదేవా !

అని తన సామ్యవాద సిద్ధాంతమును ప్రకటించెను. జ్ఞానాంజలి యనుపేర వెలయించిన పన్నెండువందల ఆటవెలఁది పద్యాలు వేమన పద్యాలవలె చిరస్థాయులు.

సన్ననూక నేల జాఱిచి జల్లెడ
ముఱకనూక గొనెడు విధముగాను
మంచి విడిచి చెడ్డ మన్నించు నీచుండు
కలిత దివ్యతేజ ! తెలుఁగు రాజ !

కులము కులమటంచుఁ గొందఱు మూఢులు
క్రుమ్ములాడుచుంద్రు కులముకొఱకు
గుణము కలిగెనేని కులముతోఁ బనియేమి ?
కలిత దివ్యతేజ ! తెలుఁగు రాజ !

తనమ బాగుగోరి తత్త్వంబు బోధించు
గురువు తిట్టవచ్చు కొట్టవచ్చు
తల్లి బుగ్గగిల్లి త్రాగింపదా ఉగ్గు - క. తెలుఁగురాజ!

ఇట్టి తేటతెలుఁగుపద్యాలు వ్రాసిన తెలుఁగురాజు అలంకారికుఁడై

రాజానందమును తన అలంకార గ్రంథములో సూక్ష్మాలంకారము నెట్లు తెలిపెనో చూడుఁడు.

ఏపగు సూక్ష్మము పరహృత్
జ్ఞాఽపరసాకూత చేష్ట అడరినచోటన్
భూపాలుడు కనినంతనె
పాపటమణి కురులగప్పె భామామణి తాన్.

అని లక్ష్యలక్షణములు నిరూపించెను.

హరికారికావలి తెనిఁగించి వైయాకరణుఁ డయ్యెను. కలనలురాజు అను వీరి ఖండకావ్యము - ప్రకృతికి ప్రతిబింబమై వెలసినది.

అక్షులు విప్పార నక్షత్రరాశితో
ప్రొద్దుపోవఁగను దోబూచులాడి
పండువెన్నెల రేల నిండుచందురునితో
బత్తిమై వెన్నెల వత్తులాడి
గున్నమామిడిచెంతనున్న పక్షులఁగూడి
ప్రీతితో డాఁగురుమూఁతలాడి
వడిఁ గొమ్మపై గెంతు ఉడుతల బారితో
మచ్చికఁ గ్రోఁతికొమ్మచ్చులాడి

... ... ...

ప్రకృతితోఁ బంతులాడెడు ప్రాజ్ఞుఁ డతఁడు
రాజమాత్రుండె కలవలు రాజు తాను.

పతిభక్తి యను ఖండకావ్యము - రామకృష్ణ యశోభూషణ మను శబ్దాలంకారార్థాలంకార లక్షణ గ్రంథములు పండితుల మన్ననల కెక్కినవి.

ప్రాచీన నవీన మార్గములలో వ్రాసిన తన కావ్యము లన్నియు తెలుఁగురాజు కృతులనుపేర ప్రకటించి శ్రీ వెలగపూడి రామకృష్ణ ఐ. సి. యస్. గారికి అంకితము చేయుచు చెప్పిన పద్య మెంత చక్కని చమత్కారజనకమై రసగుళికమై యున్నదో చూడుఁడు.

'ఐ. సీ. య'స్సు నటంచు నాను సుతనీవాలంబు కావించితేన్
గాసింజెందితిఁ జేర రమ్మనిన అక్కాలంబునం దానునున్
ఐ సీ యస్సనియే జవాబునిడు శ్లేషార్థంబుగా గాన నీ
వేసాలిచ్చట చూపఁబోవక సఖా మన్నించు మత్కన్యకన్'

ఇందలి వ్యంగము పండిత రాజు రాచఱికముతోడ ఆత్మ గౌరవమును సూచించుచున్నది.

ఇంతవఱకు తెలుఁగు వాఙ్మయచరిత్రలో ఏ కవియు ఏ మహారాజును తన యింటికి ఆహ్వానించి సమ్మానించినట్లు కానము. ఈ రాజ కవిరాజు జయపుర మహారాజగు శ్రీ విక్రమ దేవవర్మ సాహిత్య సమ్రాట్టును - కళాప్రపూర్ణుని తాను తణుకునకు మూఁడు మాఱు లాహ్వానించి సమ్మానించెను. నూఱుకాళ్ళ ఎడ్లను పూంచిన రథముపై ఊరేగించెను.

రాజులు పూర్వమందు కవిరాజుల నేనుఁగు నెక్కఁజేసి
రాత్స్వాజప్రభక్తి రాజనగరంబులఁ ద్రిప్పిరి. పౌరులెల్ల నీరాజన
మాయ నేను కవిరాజును గావుటఁ దణ్కులో మహారాజును
దిప్పినాఁడ రథరాజముమీఁదను విక్రమేశ్వరునిన్ అని సగర్వ
ముగా చెప్పుకోఁ గలిగెను. తనకుచేసిన సన్మానము లందుకొని
పండిత రాజు దేశ విదేశాలలో ఓడలలో విమానములలో
సంచరించి -

మేడయు పంటభూములు నమేయుడు విక్రమదేవవర్మ న
న్నడిత సత్కవీంద్రునిగ నెంచి యొసంగుటచేతఁగాఁదె నే
నోడల గాలియోడల మహోత్సుకతం జరియించి యెన్నియో
మాపఁగఁదగ్గ భూములను జూచితి భారత భాగ్యసీమలన్.

పోటీకొండలు దొట్టి ఘూర్జర కళింగోర్విస్థలుల్ మెట్టితిన్
రాట బ్రహ్మ మరాట వంగ కురు సౌరాష్ట్రాంగ కాశ్మీర క
ర్ణాటాంధ్రాది సమస్త దేశ నగరీ నద్యబ్ధి ర్ణాణఘురీ
కోటీ కాననశైల శృంగతతి గన్గొంటిన్ మహోత్సాహినై.

అని చెప్పుకో గల్గెను. సమయోచితముగా సారస్య
మొప్పార పలుకుట మధురముగా పద్యము చదువుట రాజుకు
వెన్నతో పెట్టినది. ఈ కవిరాజు తాను శ్రీరామకృష్ణ శ్రీవిక్రమ
దేవవర్మ మున్నగువారికి అంకితము చేసిన కావ్యములు అన్నియు
తానే తన సొంతసొమ్ముతో అచ్చువేసి వారికి సమర్పించెను.
కావున పండిత రాజు మహారాజుచే భూములు మేడలు పొంది
శ్రీరామకృష్ణగారిచే నెలకు మూఁడువందల రూపాయలు పారి
తోషికముగా పొందుచున్నాడు.

పండిత రాజు హైస్కూలు పండితులలో ఎస్. ఎస్. ఎల్. సి. కి ఛీఫ్ ఎగ్జామినరు, టి. బి. సి. మెంబరు అయినవారిలో ప్రప్రథముడు.

సాహిత్య అకాడమీ కార్యనిర్వాహక సభ్యుఁడుకూడ. వీరు సంపాదకులుగా సాహిత్య అకాడమీ వెలయించిన సూక్తి సుధాకరమను వేయి పుటల గ్రంథము. ఆంధ్రులపాలిటి సూక్తి కల్పవృక్షము. ఇందు 354 కావ్యములనుంచి 714 శీర్షికలతో సుమారు 6000 వేల సూక్తులు కలవు. వీరిటీవల శ్రీరామకృష్ణ మహాకావ్యమ్ – ను సంస్కృతములో వ్రాసి శ్రీ రాజగోపాలాచార్యులు (రాజాజీ) మున్నగువారి మన్ననల నందికొనిరి.

రాజాజీ ఏమన్నారో చూడుఁడు –

C. RAJAGOPALACHARI June 18 '63

60, BAZLULLAH ROAD
TYAGARAYANAGAR
MADRAS-17

Dear Pandita Siromani Sarma

I thank you for sending me your book on Sri V Rama Krishna — the mahakavya in five cantos. I don't know if any one else in India has been honoured in this manner. Sri Ramakrishna is a good friend and an able enterprising good man. I am glad you have eulogised him.

Yours C Rajagopalachari

పండిత రాజుపేర తణుకులో 'పండిత రాజుగారి వీధి' కూడ వెలసినది. రాజుగారియెడ తణుకు పౌరులకుగల గౌరవ మునకిది తార్కాణమై వెలయుచున్నది.

శ్రీ సత్యనారాయణరాజుగారు తానై
శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారిని
శ్రీ వెలగపూడి రామకృష్ణ ఐ. సి. యస్. గారిని
శ్రీ పి. యస్. కుమారస్వామి రాజాగారిని
శ్రీ తాతా రాయడు శాస్త్రిగారిని
శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు, హరిశ్చంద్ర ప్రసాదుగార్లను
శ్రీ కల్లూరి చంద్రమౌళిగారిని
సమ్మానించి ప్రఖ్యాతి గాంచెను.

పండిత రాజు గుడివాడలో జూనియర్ తెల్గుపండితుడుగా ప్రవేశించి, సీనియరు పండితుడై, రెండవ ప్రపంచయుద్ధ సమయమున రిక్రూటింగ్ ఆఫీసరై గుడివాడ ఆంధ్ర నలంద ప్రాచ్యకళాశాలలో తెలుగుశాఖాధ్యక్షులై ప్రస్తుతము చాగల్లు షుగరు ఫ్యాక్టరీకి పబ్లికు రిలేషన్సు ఆఫీసరుగా పనిచేయుచున్నారు. వీరికి భీమేశ్వరి, ఇందిరాదేవి అను ఇరువురు కుమార్తెలు, రామకృష్ణ రాజు బి. యస్‌సి. అనువు కుమారుడు. అందరు సంతానవంతులు. ఎందఱో మంత్రులతో ఉన్నతోద్యోగులతో ఆబాలగోపాలముతో పండిత రాజునకుగల పలుకుబడి అనన్య సామాన్యము. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో అనేక కళాశాలలలో, సభలలో, రేడియోలలో, ఆయన కావ్యగానములు సాహిత్యోపన్యాసములు చేసెను.

ఇట్టి సర్వతోముఖ భాషాసేవచేసిన వీరి పద్య గద్య కావ్యాలు ఇవి :

రామకృష్ణము (ద్విపద)
ఆరాధన
పవిత్రయూవేదన
విజయశ్రీ
చంపకమాలినీ పరిణయము (అచ్చ తెలుఁగు)
రసాలము
భీమేశ్వర శతకము
విక్రమదేవ శతకము
జ్ఞానాంజలి
పతిభక్తి
కీచకవధ (ఆశువు)
కరుణాకము
పద్యకథలు
రాజానందము (అర్థాలంకారములు)
శ్రీరామకృష్ణ యశోభూషణము (కావ్యాలంకారములు)
శిష్టవ్యాకరణము (హరిహరికావలి)
క్రిష్టమస్ యస్కర్షను
కలనలురాజు

తెలుఁగురాజా (స్వీయచరిత్ర ప్రథమ భాగము)
శ్రీరామకృష్ణ మహాకావ్యమ్ (రామకృష్ణగారిజీవితచరిత్ర)
ఉత్తర రామాయణము
గోసువంక
మొగలి రేకు
గాంధి శీలము
నవకథావళి
మనస్విని
రత్నసుందరి
ప్రతిజ్ఞ
విజ్ఞానసాగరులు
రతిరహస్యము
తపోభూమి
నవజీవనము
ఆంధ్రౌన్నత్యము
వ్యాసావళి
భారతాచ్ఛికపద నిఘంటువు (అచ్చుకాలేదు)
సూక్తిసుధాకరము
అర్ధానుస్వారశకట రేఫచంద్రిక

51

# పండిత కొత్త సత్యనారాయణ చౌదరి

## 1907

కమ్మ వంశము, తల్లి రాజ రత్నమ్మ; తండ్రి బుచ్చయ్య. అభిజనము గుంటూరు మండలములోని అమృతలూరు. జననము 31-12-1907. వృత్తి - కళాశాలాధ్యాపకత్వము. అభిమానకృషి - సాహిత్య వ్యాసంగము, గ్రంథరచన, కవిత్వదీక్ష. రచనలు - ఇప్పటికి ముద్రితములు - ముప్పదియేడు.

అముద్రితములు - ఇరువది యెనిమిది.

# పండిత కొత్త సత్యనారాయణ చౌదరి

సత్యనారాయణచౌదరి పితామహుని పేరు శ్రీ వేంకట రత్నము. ఆయన మొదటిబిడ్డ బుచ్చయ్య చౌదరి. ఆయనకు యుక్తవయస్సు వచ్చునందాక ఆ వంశమువారికి అభిజనము 'సంగం జాగర్లమూఁడి' గ్రామము. బుచ్చయ్యసోదరు లిర్వురు. ఆ తమ్ముని పేరు సుబ్బయ్య. ఆ యిర్వురు బాల్యమందే తండ్రిని గోల్పోవుటఁ జేసియు వారి కేదో రవ్వంత మాతామహి ఆస్తి పాస్తులు వచ్చుటఁ జేసియు మాతామహి జన్మవాసమైన అమృత లూరు గ్రామమే వారికి కాణాచి యయ్యెను. అందువలననే సత్యనారాయణ చౌదరి, తాను చిన్ననాఁడు వ్రాసికొన్న ఒకానొక పద్యములో, 'మాది 'అమ ర్తలూ' రనెడి మన్నన చెందిన దొడ్డగ్రామ' మని మురిసిపోయెను.

బుచ్చయ్య - రాజరత్నమ్మ దంపతులు, కన్న సంతానము ఆఱుగురిలో మగబిడ్డ లిర్వురు. వారిలో సత్యనారాయణ చౌదరి మొదటివాఁడు. రెండవయతఁడు వెంకటరత్నము.

ఈ వంశములో తరతరాలుగా ఆనాఁటికిఁ దగిన చదువు సంధ్యలు గడించినవారు ఉన్నారనియు పురాణములన్నను పౌరాణికులన్నను ధర్మమన్నను దైవమన్నను శ్రద్ధాభక్తులు కలవారు పెక్కురున్నారనియు ఆ రోజులలో పుట్టినవారి 'వంశావళి' యను పద్యగ్రంథమువలన గ్రహింపవచ్చును.

ప్లవంగనామ సంవత్సర మార్గశీర్ష - బహుళ - ఏకాదశీ మంగళవారములో సత్యనారాయణచౌదరి జన్మించెను. అనఁగా



శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

ఆ రోజు - పందొమ్మిదివందల ఏడవ సంవత్సరములో డిసెంబరు ముప్పటియొకటవ తేది.

అల్పాల్పమైన 'కొండ్ర' సాగుచేసికొనుచు స్వయముగా నేర్చిన ఏదో కొంత 'జమా-కర్చు' లెక్కల పరిజ్ఞానముచేతను వ్యవహారదక్షతచేతను వ్యాపారసరణిలో దిగి కొంత సొమ్ము గడించి బుచ్చయ్యచౌదరి, ఆ గ్రామములో ఒక మంచిరైతుగా మన్నన కెక్కెను. బిడ్డల పెంపకములో చదువుసంధ్యలు నేర్పించుటలో సంప్రదాయము విడువక సంస్కారము పాటించుచు పితృధర్మమును చక్కఁగా ఆచరించెననియే ఆయన సంతానము గర్వింతురు.

ఆ రోజులలో ఇప్పటివలె ఇంగ్లీషుచదువులు అందఱకు అందుపాటులో ఉండెడివికావు. జిల్లాలలో ఏ రెండుమూఁడు చోట్లనో ఉన్నతపాఠశాల లుండుటయు ఆ చదువులకుఁ బోవల యునన్న వ్యయప్రయాసలు మిన్నగా ఉండుటయు కద్దు. ఇంచుమించు ఏఁబదియేండ్లకు మున్నె అమృతలూరులో సంస్కృత పాఠశాలను నెలకొల్పిరి. ఆ చదువులు అందఱకు దక్కవనియు కొందఱే వానిని చదువుకొందురనియు అది పవిత్రమైన దైవ భాషయనియు అది చదివినవారికి సత్ప్రవర్తన మేర్పడుననియు ఆ భాష, భారతజాతి నాగరికతకు మూలమనియు, భారతీయులలో ఆసేతుహిమాచలము స్ఫురించు అనేకత్వములో ఏకత్వము గూర్చునది సంస్కృతమే అనియు ఈ దేశములో ఒక ప్రసిద్ధియున్నది. ఈ దృష్టిలో తెలుఁగుదేశములో అమృతలూరు పౌరులు ఈ పాఠశాలను స్థాపించి మంచిపని చేసిరనియే అభిజ్ఞులు మెచ్చుకొందురు.

నాలుగు కాసులు వెచ్చించి పాఠశాలను స్థాపించిరే కాని పాఠములు చెప్పువారెవరు? అది యొక పెద్ద 'సమస్య' అయ్యెను. దేశములో ఈ పాఠములు చెప్పఁగలవారు లేరని కాదు; ఆ చెప్పనేర్చినవారిని ఆహ్వానించి సత్కరించి పాఠశాలలో ప్రవేశపెట్టిన కొన్నినాళ్ళకే ఏదో వంకతో వారు నట్టేట ముంచెడివారు. అబ్రాహ్మణులకు సంస్కృతవిద్య చదువుటలో అర్హత ఉన్నదా! అని. ప్రతి పండితునకు సందేహామే పుట్టెడిది. ఒకవేళ – ఆమాట పైకిఁ జెప్పలేక జీతనాతములమీఁది మమతచే ఎవ్వరో ఒకరువచ్చి ఈ కొలువులో కుదిరినప్పుడు ఊరిలోని 'వాతావరణము' కొంత కస్సుబుస్సుమని ఆ పండితుని సాగనంపినదాఁక నిదురపోవని పరిస్థితియు దాపరించెను.

ఆ గ్రామములో 'రైతుపెద్ద' ఒకరు ఈ పరిస్థితి గమనించి పాఠశాలా నిర్వాహణమునకై నడుము కట్టెను. ఆయన పేరు శ్రీ పరుచూరు వెంకయ్యా చౌదరి. దేవుఁడు వెంకయ్యా – అని ఆయననుగూర్చి వాడుక ఉన్నది. ఆయన మంచి వ్యవహారదక్షుఁడు; లోకజ్ఞుఁడును. ఆయన పొలమునుండి వచ్చుచు ముల్లుగట్టుమీఁద మొగము పూనికచేసి దూరమునుగానిలిచి వినుచున్నాడని తెలిసినప్పుడు పౌరాణికుఁడు ఉన్న తెలివిపోయి 'పప్పులో కాలువేయుట' కద్దు. ఆయనకు సంస్కృతమన్నను ఆయుర్వేదమున్నగు ప్రాచీన విద్యలన్నను ఎంతో అభిమానము. ఆ యభిమానము మూలముననే ఆయన, పాఠశాలమీఁద కన్నుఉంచి, రాయలసీమనుండి విద్వాంసు నొకని దీసికొనివచ్చి పాఠశాలలో ప్రవేశపెట్టెను. గ్రాసవాసము లేర్పఱిచినఁగాని ఈ పండితులు

నాలుగు కాలాలు నిలువదని పూర్వానుభవమువలన గుర్తించి ఆయనకొక 'ఇల్లు' కట్టించి యిచ్చెను. ఇంటిల్లిపాదికి తగిన గ్రాసమిచ్చెడి పొలము కొంత ఆయన పేర బెట్టెను. ఆ రైతు పెద్ద బ్రదికియున్నంతదాఁక ఆ పండితుని వలన ఆ పాఠశాల చక్కఁగా సాగెను. ఆయనపోయిన వెంటనే ఆ పండితుఁడు ఆ 'గ్రాసవాసము' లను చేతిలోఁ బెట్టుకొని అనుభవించుచు, ఆ గ్రామము విడిచి పట్టణములో మకాముపెట్టి ఇంగ్లీషుబడిలో 'టీచ' రయ్యెను. ఆయన పుణ్యమా యని పాఠశాలా విద్యార్థులు పంచకావ్యములవఱకు చదువఁగలిగిరి. కాని, అక్కడనే ఉన్నది 'సమస్య.' 'కౌముది' ప్రారంభింపవలె. అది వ్యాకరణ శాస్త్రముగదా! శాస్త్రముజోలికి ఈ పిల్లలు రారాదుగదా! 'రైతుపెద్ద' పోయినవెంటనే ఈ 'సమస్య' ఈ తీరుగఁ దీర్చుకొని ఆ పండితుఁడు తనపని తాను జూచుకొనెను.

ఈ ఘట్టములో కొన్నాళ్ళకు ఆ యూరివారి అదృష్టవశమున దాక్షిణాత్యులైన పండితులొకరు పాఠశాలకు దక్కిరి. ఆయన అప్పుడే మైలాపూరు సంస్కృత కళాశాలలో 'మీమాంస శిరోమణి' లో ఉత్తీర్ణులయి అధ్యాపక వృత్తికి సిద్ధముగా ఉండిరి. ఆయనపేరు కంబంపాటి స్వామినాథశాస్త్రి గారు. వారి పూర్వులు దక్షిణాదికి వలసపోయిన తెలుఁగువారు. ఆయన. అమృతలూరు పాఠశాలలో అడుగుపెట్టిన వెంటనే ఊరిలో 'బాహ్మణ్యము' చేయదగినంత అలజడి చేసిపెట్టిరి. దానికా శాస్త్రివర్యులు అదరక బెదరక స్తిమితముగా నిలిచి యుండి చిరకాలము పాఠశాలను జక్కఁగా పెంచి ఎందఱనో శిష్యులను సిద్ధము చేసెను. ఆయనపెట్టిన 'భిక్ష' వలననే ఈ

సత్యనారాయణచౌదరివంటి విద్యార్థులు ఎందఱెందఱో రెక్కలు వచ్చి విద్యాగంధము రవ్వంతైన మూచూడఁ గలిగిరి. ఆ 'బ్రహ్మణ్యులు' ఈ ప్రాంతమువారికిఁ గావించిన అత్యంత సహకారమును మనస్సులో భావించుకొని సత్యనారాయణ చౌదరి తాను సంస్కృతములో వ్రాసిన 'శకుంతలా' గ్రంథమును ఆయనగారి కంకితమిచ్చి ఋణములో రవ్వంతైనఁ దీర్చుకోఁ గలిగితినని సంబరపడును.

సంయుక్తాంధ్ర మద్రాసు రాష్ట్రంలో పల్లెటూళ్ళలో ఉన్న సంస్కృత పాఠశాలలలో అమృతలూరు పాఠశాలకు మంచి పేరుప్రతిష్ఠ లున్నవి. అర్ధశతాబ్దికిపైగా ఆ ప్రాంతము వారెందఱో పంచకావ్యములదాఁక అందే చదివి పేరు గడించిరి. 'బాపూజీ ఉద్యమమువంటి అనేక మహోద్యమములకు సైతము పరోక్షముగా ఆ పాఠశాల అనుబంధము కలిగి యుండెనేదని చెప్పవచ్చును. ఆడుపిల్లలలో సైతము సంస్కృతవిద్య అంతో ఇంతో అంటినదన్న ప్రఖ్యాతి ఆ రోజులలో అమృతలూరు గ్రామమునకే దక్కినది.

శ్రీసత్యనారాయణచౌదరి ఆ పాఠశాలలో ఆఱేండ్లు సంస్కృతముచదివి 'ప్రవేశపరీక్ష'లో ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణుఁడయి ఆవల బందరు పరగణాలో ఉన్న చిట్టిగూడూరు నారసింహ సంస్కృత కళాశాలలోఁ జేరెను. అక్కడ 'గురుకులవాసము'గా నాలు గేండ్లు గడపి 1929 మార్చిలో "ఉభయ భాషాప్రవీణ ఎ" పరీక్షలో రెండవ తరగతిలో ఉత్తీర్ణుఁ డయ్యెను. ఆ సంవత్సరమే జూలై 22 వ, తేదిని గుంటూరుజిల్లా రేపల్లె బోర్డు హైస్కూలులో ఉపాధ్యాయ పండితుఁడుగా ఉపక్రమించి అయిదాఱు

ప్రసిద్ధములైన హైస్కూళ్ళలో ఇరువది ఎనిమిదేండ్లు అవిచ్ఛిన్నముగా పనిచేసెను. 1957 వ సంవత్సరములో జిల్లాబోర్డు ఉద్యోగమును విడిచిపైచి, నిడుబ్రోలు - పి. బి. యన్. కాలేజిలో తెలుగు లెక్చరరుగా జేరి ఏదో కొంత భాషాసేవతో పాటు కాలక్షేపము చేయుచున్నాఁడు.

1928-29 సంవత్సరములలో సంస్కృత కళాశాలలో 'సంస్కృత భాషా చరిత్ర - వాఙ్మయచరిత్ర' పాఠ్యముగా విన్న అంశములను శ్రద్ధగా వ్రాసిపెట్టుకొని దానికొక ఆకృతిఇచ్చి 1931 లో 'వైదిక వాఙ్మయచరిత్ర' అన్న పేరుతో తొలిగ్రంథముగా శ్రీ సత్యనారాయణ చౌదరిగారు వ్రాసి అచ్చువేయించెను. అది సంస్కృత కళాశాలలో 'విద్వత్ప్రథమ' పరీక్షలకు పాఠ్యముగా అక్కఱకు వచ్చినది. ఆ రోజులలో అచ్చునకై ఆ పుస్తకమునకు ఆఱువందల రూప్యములు ఖర్చుపెట్టి ఇంటిలో తండ్రిగారికి సైతము చెప్పక ముద్రింపటఁజేసి కొంత "వ్యసనము" కలిగి వెంటనే పాఠ్య పుస్తకములు కొన్ని వ్రాసి ఆ యప్పుతీర్చి తన్మూలమున గ్రంథ రచనోద్యమములో ఉత్సాహము పెంచుకొనెను. హైస్కూళ్ళలో పిల్లలకు కేవలము పాఠాలు చెప్పుటయే గాక ప్రత్యేక వ్యాసంగముగా గ్రంథ పఠనము చేయుచు నిత్య కృత్యముగా కొంత "రచన" అభ్యాసముచేయుచు "వైదిక వాఙ్మయ చరిత్ర"తో పాటు "గ్రంథమండలి" యొకటి "స్వయం రాజా స్వయం మంత్రి" అన్నట్టు తానే స్థాపించుకొనెను. దాని పేరు "భాషాపోషక గ్రంథమండలి". దాని ఉనికిమనుకుల తీరుతియ్యములివిగో - ఇవి:—

"ఆంధ్రభాషాయోషకు సనియగు బలుపు నాకాంక్షించి ఈ గ్రంథమండలిని వెడలించితిమి. ఏతన్మూలమున అతివిశాల మగు సంస్కృత వాఙ్మయముపైని పాశ్చాత్య పండితులు వెల యించిన విమర్శనములను ప్రదర్శింతుము. స్మృతులు పురాణ ములు లోనగువానిలో విశిష్టములగు వానిని అందఱి కవగాహ మగునటులు తేటతెలుఁగున వివరింతుము. సరసములగు సంస్కృ తాంగ్ల గ్రంథములను ఆంధ్రబాలురకు ఉపయుక్తమగు వానిని బయలుపఱతుము. బాలికా బాలకులకు సాహ్యాపదు పద్యగద్య కావ్యములను - "కలిపురాణ" శ్రేణిని ప్రకటింతుము." సంపాద కుఁడు; సర్వాధికారి - సత్యనారాయణ చౌదరి.

ఇట్టి సంకల్పముతో ముప్పదినాలు గేండ్లనుండి ఏదో తోఁచినట్లు పద్యములో గద్యములో రచన చేయుచు దరిదాపు డెబ్బది గ్రంథములను శ్రీ సత్యనారాయణ చౌదరి ఒక రూపు నకుఁ దెచ్చెను. వానిలో ఇప్పటికి ముప్పదియేడు మాత్రమే ముద్రితములు. ఇంటిలో ఎదిగియుండి అవివాహితులైన ఆడు పిల్లలవలె తక్కిన రచనలు అచ్చుకోస మెదురుచూడవలసిన అక్కఱ కల్గుచున్నది.

శ్రీ సత్యనారాయణ చౌదరిగారికి భాషాప్రపంచములో అభిమానమూర్తి శ్రీ పరవస్తు చిన్నయసూరి. సూరివంశమునకే తలమానికమైన చిన్నయ్య, ఆంధ్రికి పెట్టిన "భిక్ష" ఇంతయంత యని చెప్పలేము. కాలమునుబట్టి ఆ మహావ్యక్తిని తక్కువచేసి తన్మూలమున తెలుఁగు వాఙ్మయమునకే అపరాధముచేసిన విద్వాంసులు మన దేశములో ఉన్నారు. ఆ విషయమై శ్రీ సత్య

నారాయణ చౌదరిగారు తనకుఁ దోఁచిన ఆధారములతో "చిన్నయ్య" అన్న పేరుతో ఒక చిన్న రచనచేసి తెలుఁగు వారి కిచ్చెను. ఇతర విద్వాంసు లెందఱో పనిపూని నడుము కట్టి చిన్నయసూరి కీర్తిమూర్తికి కళంకము తేవలెనని ప్రయత్నించినను, చిన్నయ్య హృదయము చక్కఁగా గ్రహించి ఏఁబదియేండ్లుగా శిష్యకోటికి సూరి రచనలు బోధించుచు తాము గుర్తించిన సత్యమును నిరాఘాటముగ లోకమునకు వెల్లడిచేసిన మహావిద్వాంసులు బ్రహ్మశ్రీ మవ్వూరి వేంకటరమణశాస్త్రివర్యులను ఈ ఘట్టములో పేర్కొననిచో కృతఘ్నతయే కావచ్చును. సంస్కృతభాషలో "కౌముది"కి ఈడు జోడు కాఁగలిగి తెలుఁగులో పుట్టిన సర్వవ్యాకరణములకు మేలుబంతియైన బాల వ్యాకరణమునకు సమీక్షగా "రమణీయ" మను బృహద్గ్రంథమును రచించి "మవ్వూరి" వారు తెలుఁగువారికిఁ జేసిన మహోపకారము ఇంతింతకాదు. ఆ శాస్త్రివర్యుల ముఖ్య శిష్యులలో ఒకఁడుగా ఉండనోఁచితినని శ్రీ సత్యనారాయణ చౌదరిగారు అనుక్షణము సంబరపడుచుండును.

పూర్వ వాఙ్మయములో కులగోత్రాల పేరుతో జాతి మతముల వంకతో కావలసినన్ని కల్మషములు పుట్టి పెరిగి- అదియొక సంప్రదాయముగా సనాతనాచారముగా వర్ధిల్లి, తన్మూలమున పీడితులైన వారికి సైతము అదే ఉపాస్యమన్న ధోరణిలో వెలసినది. ఈ దేశములో ఈ రహస్య మెఱిఁగినవారు ఎందఱోఉన్నను రచనలో కవితలో నిబ్బరముగా నిరాంతకముగా బయటపెట్ట నేర్చినదిట్టు, ఒక్క త్రిపురనేని రామస్వామి

చౌదరియనియే చెప్పవలెను. ఆ త్రోవలో వ్యాసంగముచేసి ఆ రహస్యములను మఱికొన్నింటిని గుర్తించి ఆ వంకకే కలము త్రిప్పి శ్రీ సత్యనారాయణ చౌదరిగారు "కలి పురాణశ్రేణిని" వెలువరింప సాగెను. "కలి పురాణ" మన్న పద్యకావ్యము ఇంత వఱకు అయిదు భాగములుగా వెడలినది. వర్ణాశ్రమ ధర్మమన్న పేరట-సనాతనాచారమన్న ధోరణిలో, అవకాశము కలిగినప్పుడెల్ల తెలుఁగులో "విశ్వనాథవారు" వ్రాసెడి వ్రాఁతలు చదివి ఏవగించుకొనువారు నూటికి ఎనుబది మందికిపైగా ఉన్నను వ్రాఁతలో వానిని ఖండించువారు ముందునకు రారైరి. ఆయనకేదో ఇంత ప్రతిష్ఠ ఉన్నదన్న భ్రమచేత- ఆయన నోటివెంట వచ్చిన మాటలకెల్ల "భజగోవిందము" పాడు శిష్యపరమాణువులు కొందఱు పిల్లగంతులువేయుచుండుటచేత అధికారికముగా సాంఘికముగా రాజకీయముగా ఏవేవో ఇబ్బందులున్నవన్న "స్వార్థము" చేత, విశ్వనాథవారి రచనలలోని అవకతవకలను దెలిసియుఁ గొందఱు గ్రంథస్థము చేయరు. విషయమందే గాక రచనలో శయ్యలో శాబ్దికముగా ఆర్థికముగా ఆయన చేసెడి దోషములు లక్షలుగా ఉన్నను ఉపేక్ష వహించుటయే విద్వాంసుల కనేకులకు ఆచారమైనది. "శ్రీమద్రామాయణ కల్పవృక్షము" మహా కావ్యమనియు, కవిత్రయమువారు పోతనామాత్యులు భారత భాగవతములను తెలుఁగునకుఁ దెచ్చిరే గాని వాల్మీకమున కనువాదము నేఁటివఱకు సరియైనది రాలేదనియు ఆ లోపము "వైశ్వనాథము" తో తీరినదనియు, వాల్మీకమునకే "కల్పము" అచ్చముగా భాష్యము వంటిదనియు ప్రసిద్ధమైన

సంస్కృతాంధ్ర మహాకవు లనేకులు పోవని పోకడలు ఈ కల్ప వృక్షములో ఉన్నవనియు శ్రీనాథాదులనే గాక వాల్మీకిని సైతము ఈ గ్రంథకర్త ఒక విధముగా రచనలో మించెవనియు విశ్వనాథవారి బృందముతోపాటు విశ్వనాథులవారికిని ఈ భావ మున్నట్లు ఉపన్యాసములవలన ప్రసంగములవలన స్పష్టమగు చున్నది. ఈ భావమే ప్రకోపించి ఎదురెవ్వరు లేరన్నధీమాతో భాష్యమని వంకపెట్టి వాల్మీకమును వికృతపఱిచి అందలి పాత్ర లను అపాత్రులనుజేసి లాక్షణికముగా లక్ష్యోపలక్షలుగా అప భ్రంశములు కావించి, తెలుఁగు మర్యాదనే చెఱిచి ఛందస్సునే చెఱిచి విశ్వనాథవారు యథేచ్ఛముగ సంచరించిన ఘట్టము లనేకము లున్నవి.

"విశ్వనాథ పంచశతి" పేరుపెట్టి ఆయన వ్రాసిన అయిదు వందల పద్యములలో బూతు లెన్నెన్ని కలవో జాతినింద - వర్గ దూషణ ఎంతెంత కలదో సోపపత్తికముగా శ్రీ సత్యనారాయణ చౌదరిగారు వ్రాసియుండెను. దాని పేరు "పంచశతీపరీక్ష." తీరిక లేనివారు ఓపిక చూపలేనివారు విశ్వనాథ రచనలు అన్నింటిని జూడవలసిన పనిలేదు; "పంచశతీపరీక్ష" అనెడి ఈ చిన్న సమీక్షను జూచినఁ జాలు; ఆయన తత్త్వము అక్షరాల ఆ రచనలో ప్రతిబింబించి కన్నులకుఁ గట్టినట్టు స్పష్టమగును. వాల్మీకి మొత చేతిలోఁ బెట్టుకొని "కల్పవృక్షము"ను ప్రత్యక్షరము పరిశీలించి చూడఁగా తెలుఁగుబాసకు ఆయనచేసిన ద్రోహము వాల్మీకి మహార్షికి ఆయన కావించిన అపచారము వ్యక్తముకాఁగలదన్న భావనతో శ్రీ సత్యనారాయణ చౌదరిగారు "కల్పవృక్షఖండన"

మని పేరుపెట్టి తెలుఁగువారి కెఱుకపఱిచెను. ఇదే ధోరణిలో "వేనరాజు - వేయిపడగలను - గూడ పరీక్షలోపెట్టి ఆయన తత్త్వము స్పష్టపఱుపవలెనన్న సంకల్పముతో శ్రీ సత్యనారాయణచౌదరిగారు కృషి చేయుచున్నాఁడు.

ఇఁక అధ్యాపకవృత్తి :—

1929 లో హైస్కూలులో ఉపాధ్యాయుఁడుగాఁ జేరి ఇరువదియెనిమిదేండ్లు చేసిన బోధకు - కృషికి కాలేజి ప్రవేశము మిక్కిలిగా సహకరించినదని శ్రీ సత్యనారాయణ చౌదరిగారి భావము.

ఆ చదువులకు ఈ చదువులకు అంతరమెంతో ఉన్నందు వలనను కఱవుతీరునట్లు కవిత్రయమువారి రచనలుగాని లాక్షణిక భాగములుగాని ప్రసిద్ధఘట్టము లెన్నో కాలేజిలో పాఠ్యము లుగా ఉండుటవలనను శ్రీ సత్యనారాయణ చౌదరిగారి గ్రంథ రచనోద్యమమున కెంతో "స్థాయి" చిక్కినదని చెప్పవచ్చును. రచనకుఁ గావలసిన "గ్రాసమే" కాక విశ్రాంతియు మిక్కిలిగా దొరకుటచే దినదినాభ్యుదయముగా ఏదో కొంత భాషాసేవ చేయుటకు అవకాశము చిక్కినది. అడ్డమైన దేవిరిగొట్టు నాశ్ర యించి లాఁతివారి పడిపంచలఁబడి యాచించి సొమ్ము తెచ్చి వ్రాసినవి అచ్చు వేయించుకొనుటలో మనసొప్పని శ్రీ సత్య నారాయణ చౌదరిగారు చీమవోలె కూడఁబెట్టిన ఆ రవ్వంత సొమ్మునే ఆధారము చేసికొని అనువైనవేళలో అచ్చుపని చూచుకొనుటయే సంప్రదాయమైనది. దేశమునకో భాషకో రాజకీయములకో కళలకో జీవిత మంకితమిచ్చిన వ్యక్తులకే

శ్రీ సత్యనారాయణ చౌదరిగారి రచనలు కొన్ని అంకితమైనవి. ఈ ఘట్టములో గురువులకు తల్లిదండ్రులకు మున్మొదటనే పెద్దపీటలు వేయుట సంభవించినది. తనకుఁ దోఁచిన ధోరణిలో తన యిలువేల్పగు శ్రీనివాసునకు శ్రీ సత్యనారాయణ చౌదరి గారు కొన్ని రచనలు సమర్పించుకొనెను.

ఇటీవల వయస్సుతోపాటు అనారోగ్యము పెరిఁగి అకటా వికటము చేయుచున్నను సాంసారిక వ్యాపకములు వెంటఁబడు చున్నను అధ్యాపకవృత్తిలో అంతగా విశ్రాంతి దొరకకున్నను చిరకాల సంప్రదాయముగా అనుస్యూతముగా వచ్చుచున్న "భాషాకృషి" విడిచిపెట్టలేదన్న సంబరము శ్రీ సత్యనారాయణ చౌదరిగారికి మిక్కిలిగాఁగలదు. గద్యమో పద్యమో వ్యాసమో ఉపన్యాసమో ఏవో ఇన్ని "ముక్కలు" వ్రాయని "వారము" శ్రీ చౌదరిగారికి నిట్టుపాసము వంటిది. వేసవిసెలవులలో ఏదో ఒక "రచన" ఆకృతికివచ్చి అచ్చున కెదురుచూడవలెనన్నదే శ్రీ చౌదరిగారి దీక్ష. చేసిన రచనలలో అనేకములు పునర్ము ద్రణమున కెదురుచూచుచుండఁగా కొంగ్రొత్తవి కంటి కెదురై వ్రాతలో బంధింపఁబడి ఉండవలసి వచ్చుచున్నది. అయినను పరమేశ్వరానుగ్రహము వలన తమ జీవితములో తమ చేతిలో సాగిన రచనలన్నియు అచ్చునకు రావచ్చుననియే ఏదో మొండి ధైర్యములో శ్రీ చౌదరిగారు నిలిచియుండును.

పాఠకుల పరిశీలనముకోసమై శ్రీ సత్యనారాయణ చౌదరి గారు కావించిన రచనలను పేర్కొనుట అప్రస్తుతము కాదను కొందుము :—

ముద్రితములు :- వైదిక వాఙ్మయ చరిత్ర, సతీసప్తశతి, కథావింశతి, చంద్రాపీడ చరిత్ర, కామశాస్త్రము, కావ్యమాల 1-2 భాగములు, సుభాషితము, ధర్మశాస్త్రము, కవుల కథలు, వరరుచి, ఈశ్వర సేవకులు, విక్రమ కథలు, ప్రొముక్కబడి, నవనాథము, బృహత్కథలు, వత్సరాజు, విక్రమాదిత్యము, సాలభంజికలు, బొప్పూజి, చారుదత్తము, నీతిచంద్రిక, చిన్నయ్య (సూరి చరిత్ర), నైషధము, కలిపురాణము, ప్రతాపసింహము, వీరపూజ, చాణక్యము, దివ్యమూర్తులు, స్వరాజ్య కథలు, మాయాభిక్షువు, కలిపురాణము 2 భా. మా స్వామి, మంజరి, పంచశతీపరీక్ష, జాతక కథలు, సైరంధ్రి.

అముద్రితములు :- కల్పవృక్ష ఖండనము, సాహిత్య వ్యాసములు, అంజలి, కులపతి (శ్రీ వరదాచార్యులవారి చరిత్ర) స్వరాష్ట్రము, కలిపురాణము (3, 4, 5 భా) మేవాడ విజయము, మహారథులు, లోకతంత్రము, సాహితీసమీక్ష, నాయుపాధ్యాయగిరి, త్యాగయ్య, రామరాజభూషణము, కావ్య కథలు, తెలుఁగు వెలుగులు, చిత్రకథలు, వినోదకథలు, పండితుఁడు, శిశుఘ్న, శకున్తలా (సంస్కృతము) కవిత్రయము, తెలుఁగు లక్షణము, వాల్మీకము, మాలిక, బాలప్రౌఢ ప్రశ్నోత్తరమాల, కవిరాజు (తిపురనేని) ఇత్యాదులు.



# చిలుకూరి పాపయ్య శాస్త్రిగారి
# స్వీయ చరిత్ర

మాది చిలుకూరి వంశము. ఈ వంశ మాంధ్ర దేశములో సంస్కృత వ్యాకరణమునకు ప్రసిద్ధి కెక్కినది. ఇప్పటి కేడు తరములనుండి మా వంశము వారందఱు వ్యాకరణ శాస్త్రము నభ్యసించినవారే. మా తాతలు నలుగురు. వారు ఆంధ్ర దేశములో ఇంద్రగంటి గోపాలశాస్త్రిగారి దగ్గఱ, కాశీక్షేత్రమున నాగేశ్వర పండిజీవారి దగ్గఱ వ్యాకరణశాస్త్ర మభ్యసించి, ఆనా డాంధ్ర దేశములోని వివిధ రాజాస్థానములలోను, పండిత సభలలోను శాస్త్రార్థములుచేసి విజయములు సాధించి, చిలుకూరి చతుష్టయము అను ప్రఖ్యాతి నార్జించినవారు. వారివఱకు మా వంశములో వేదము వ్యాకరణశాస్త్రము రెండును పఠన పాఠనములలో నుండెడివి. మా తాతల తరమునుండియే కేవల వ్యాకరణశాస్త్ర పఠన పాఠనములు కొనసాగుచు వచ్చినవి. మా తాతలనాటివఱకు వారు నివసించినచోటు పశ్చిమగోదావరి జిల్లాలోని మార్కండేయపురము. ఇప్పుడు దానిని మార్కొండపాడు అని యందురు. మా పూర్వుల పెద్దతనము నెఱిగిన వారుండిన, మా యింటి పేరు 'చిలుకూరి' అనిన వెంటనే 'మార్కొండపాడు చిలుకూరివారా మీరు?' అని ప్రశ్న వేయుదురు. మాకు మా పూర్వు లట్టి విశిష్టతను తెచ్చిపెట్టినారు. ఆ చిలుకూరి చతుష్టయములో నా పేరింటివారి మనుమడను నేను.

మా తండ్రుల తరములో మార్కొండపాడు వదలి మా పెదతండ్రిగారు సోమనాథశాస్త్రిగారు తుని ఆస్థాన విద్వాంసులుగను, మా తండ్రిగారు కొండయ్యశాస్త్రిగారు గోపాలపురము యస్టేటు జమీందారుగారి ఆస్థాన విద్వాంసులుగ పొడగట్లపల్లిలోను ఉండి, శిష్యులకు విద్యాబోధనము చేయుట వృత్తిగా కాలము గడిపినారు. మా పెదతండ్రిగారు భాగవతుల హరిశాస్త్రిగారి శిష్యులు. మా తండ్రిగారు మానవల్లి గంగాధరశాస్త్రిగారి శిష్యులు. మా తాతలు మొదటి యిరువురు ఆంధ్రదేశములోను, తరువాతి యిరువురు కాశీలోను, విద్యాభ్యాసము చేసినట్లే మా పెదతండ్రిగారు కోటిపల్లిలోను మా తండ్రిగారు కాశీలోను వ్యాకరణశాస్త్ర గ్రంథములు చదివినవారు. మా పితామహులవలె మేమును నలుగురము సోదరులము. మేమును వంశక్రమాగతమైన వ్యాకరణ శాస్త్రము నభ్యసించినవారమే.

—: జ న న ము :—

మా చతుష్టయములో నేను జ్యేష్ఠుఁడను. నా జన్మస్థలము ఒకప్పుడు మా తాతతండ్రులు నివసించిన కోనసీమకు జేరిన 'మురమళ్ళ' అను గ్రామము. అది మా మాతామహస్థలము. అచట నిత్యకల్యాణము పచ్చతోరణముతో నీనాటికిని విలసిల్లుచున్న భద్రకాళీసహిత వీరభద్రేశ్వరుఁ డున్నాఁడు. ఆ స్వామి కెదురుగనున్న మా తాతగారి యింటిలో సాధారణ నామ సంవత్సర పుష్య బహుళ తదియనాడు 17-1-1911 నాఁడు నా జననము. నా పుట్టుకనాటికి మా తండ్రిగారు దాక్షారామ సంస్కృత పాఠశాలలో ఉపాధ్యాయులుగా ప్రవేశించి

నారు. అచటి సంస్కృత పాఠశాల వారితోనే ప్రారంభమైనది. నా బాల్యము రెండున్నఱ వత్సరము లక్కడ గడిచినవెనుక 1914 లో మా తండ్రిగారు పొడగట్లపల్లి సంస్కృత పాఠశాల కుపాధ్యాయులుగా వచ్చినారు. ఆ పాఠశాలకూడా వారితోనే ప్రారంభమై యీనాటికి కూడ కొనసాగుచున్నది. ఇప్పటికి దానికి చిలుకూరివారి పాఠశాల యని పేరు.

## —: వి ద్యా భ్యా సము :—

మా తాతగారి వార్ధకపువేళలో నేనే ముందుగ జన్మించిన పౌత్రుడ నగుటచే, ఆంగ్లము నభ్యసించినవారి కానాటికే అర్థలాభ మధికముగ నుండుటచే మా తాతగారికి నా కాంగ్ల భాష నభ్యసింపజేయవలయునని యుత్సాహ ముండెడిదట. మా మేనమామలు కొంద అప్పటికే ఆంగ్లవిద్య నభ్యసింప మొదలుపెట్టిరి. ఈ కారణములచే మా తండ్రిగారు నన్ను మూడవ తరగతినుండియే బడిచదువు మానిపించి, 1920 లో కాకినాడలో ఆంగ్లము చదివింప మొదలుపెట్టిరి. పీఠికాపురాధీశ కళాశాలకు అనుబంధముగానుండిన హైస్కూలులో 5వ తరగతి రెండుమాసములలో చదివి ఉత్తీర్ణుడనై, రామారావుపేట బ్రాంచి స్కూలులో 1 వ ఫారము చదివితిని. ఆనాటికి మా మాతామహ కుటుంబముకూడ కాకినాడకుఁ జేరినది. ఈవిధముగ నాకు 10 వ యేట కాకినాడతో పరిచయ మేర్పడినది. 1921 లో నా ఆంగ్ల విద్యాభ్యాసము కాకినాడనుండి, పొడగట్లపల్లికి సమీపమునందున్న కొత్తపేట హైస్కూలునకు మార్చుట జరిగినది. అక్కడ 2 వ ఫారము చదువుచుండఁగా,

నాకు తల్లిదండ్రులను వదలియుండుట శక్యము గాకపోవుటచే 1921 డిసెంబరులో మా తండ్రిగారు శబ్దమంజరి నారంభించి వంశక్రమాగత విద్యలో నన్ను ప్రవేశపెట్టి చదివింప మొదలు పెట్టిరి. అది మొదలు 1928 నాటికి నేను మా తండ్రిగారిదగ్గఱ నైషధాంత కావ్యములు సిద్ధాంతకౌముది యంతయు చదివి, ఆ ఏప్రెల్‌లలో ప్రభుత్వమువారి ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణుడనైతిని.

మా తండ్రిగారు ప్రసిద్ధ పండితు లగుటచే, వారికి పుత్రుఁడనైన నేను గీర్వాణవిద్య నభ్యసించు చుండినపుడు, ఆనాటి పరిపాటినిబట్టి కనఁబడినవారెల్ల నన్ను పరీక్షించుచునే యుండిరి. అందువలన నేను చదివినంతమేరకు నాకు వచ్చిన అక్షరములు గట్టిగనే యుండవలసి వచ్చినది. అదియునుగాక మా తండ్రిగారు నాచేత నితర విద్యార్థులకు పాఠములు చింతనలు చెప్పించుచు వచ్చిరి. అందుమూలమునను నాకు సంస్కృత భాషా సంస్కారము కొంత దృఢపడినది. 1928 లో నేను తునిలో మా పెదతండ్రిగారిదగ్గఱ వంశక్రమాగతమైన వ్యాకరణ శాస్త్రమును ప్రాచీన పద్ధతిలో చదువనెంచి పరిభాషేందు శేఖరము ప్రారంభించి పూర్తిచేసితిని. 1929 లో వ్యాకరణ విద్యాప్రవీణ చదువవలెనని విజయనగరము సంస్కృత కళాశాలలో ప్రవేశించి రెండుమాసము లుంటిని. అప్పటికి నా శరీరారోగ్యమును కొంత సడలినది. అచటి విద్యాభ్యాసపద్ధతి ఆచార వ్యవహారములును నాకు రుచింపక, కాలేజీ విద్యాభ్యాసమునకు స్వస్తిచెప్పి, మరల తుని వచ్చి మా పెత్తండ్రిగారి దగ్గఱ శబ్దేందుశేఖరము ప్రారంభించి పూర్తిచేసితిని.

1930 జూన్ నెలలో మా తాతా సహోదరులు, చిలు

కూరి చతుష్టయములో 3 వ వారైన లక్ష్మీనారాయణశాస్త్రి గారి మనుమలైన లక్ష్మీనారాయణ శాస్త్రిగారు రాజమహేంద్రవరము ఆర్యాపురము సంస్కృత పాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగా నియమింపబడిరి. వారు నాకంటె రెండేండ్లు మాత్రమే పెద్దలు. అయినను వారి వ్యాకరణశాస్త్ర పాండిత్యము నిరుపమానము. ఆ భాష్యాన్త వ్యాకరణ గ్రంథము లన్నియు పూర్వపక్ష సిద్ధాంతములతో సహా కంఠస్థములై వారికి వాచోవిధేయములుగ నుండినవి. వ్యాకరణశాస్త్రము న్యాయశాస్త్రము కొంత వారు గురువులనుండి అభ్యసించినారు. పూర్వమీమాంసను అలంకార శాస్త్రమును తమ ప్రతిభ చేతనే సాధించిరి. వేదము చాలభాగము నభ్యసించి వైదిక కర్మానుష్ఠాన తత్పరత సదాచార సంపత్తి గలిగి పరమాదర్శ పూరుషులుగా నుండెడివారు. వారు రాజమండ్రికి జేరినంతనే నేను, నా తరువాతి సోదరు లిరువురము వారిదగ్గఱ వ్యాకరణ శాస్త్రాభ్యాసమునకు ప్రవేశించితిమి. మనోరమా శబ్దరత్నమును వారిదగ్గఱ నేను చదువుచుండఁగా, మా తండ్రిగారు 30-12-1930 లో దివంగతులైనారు. తన్మూలముగ నేను, నా విద్యాభ్యాసమునకు స్వస్తిచెప్పి, మా తండ్రిగారి స్థానమున పొడగట్లపల్లి సంస్కృతపాఠశాలలో ప్రధానోపాధ్యాయపదవిలో ప్రవేశించి, కుటుంబభారమును నిర్వహింపవలసి వచ్చినది.

—: హిందీ భాషాభ్యాసము :—

అంతకుముందే నేను మా తండ్రిగారి స్థానమున పాఠశాలలో విద్యార్థులకు పాఠములు చెప్పు అలవాటు గలవాడనై

యుండుటచే, నా కా పని క్రొత్తగా లేకుండుటచే, అప్పటికే స్వశక్తిచే కొంత హిందీభాష నభ్యసించి, దానిని వృద్ధిచేసికొని సంస్కృతభాష నభ్యసించు విద్యార్థులకు హిందీభాషనుకూడ బోధించుట మొదలుపెట్టితిని. తన్మూలముగ 1931లో 19 విద్యార్థులతో ప్రారంభించిన మా పాఠశాలలో విద్యార్థుల సంఖ్య 33 నాటికి 45 వఱకు పెరిగినది. అప్పటికి నేను రాష్ట్రభాషా విశారదలోను, నా విద్యార్థులు విద్యాప్రవీణ భాషా ప్రవీణ యెంట్రన్సులలోను, ప్రవేశికవఱకు హిందీ పరీక్షలలోను ఉత్తీర్ణులగుట సంభవించుచు వచ్చినది. అప్పటప్పట కొంచెము ఆంగ్లభాషను చదువుట తటస్థించినను సరిపడిన సంస్కారము లభింపలేదు. కాని యీ కొఱతను హిందీ భాషాభ్యాసము తీర్చివేసినది. 1934 లో మా గ్రామములోని పెద్దలు నేను హిందీని బోధించుటలో విశేషశ్రద్ధను చూపించుట యుక్తముకాదని హెచ్చరించిరి. నాకును పశ్చాత్తాపము కలిగినది. ఈ సమయమును వెచ్చించిన ఇంకొక శాస్త్రమును సాధించి యుండెడివాడనే, కాలము వృథయైనదనిపించినది. మహాభాష్యశాంతి చేయకపోయితిమే అని యనుశోచనము బయలుదేరినది. అప్పటికి నాకొక కుమారుడు కలిగినాడు. 1935 లో నేను, నా సోదరుడు వీరభద్రశాస్త్రియు కలిసి రాజమహేంద్రవరమున మా లక్ష్మీనారాయణశాస్త్రి గురువరేణ్యుల సన్నిధిని మహాభాష్య శాంతి చేయుట జరిగినది. దానితో మరల శాస్త్రసంగ్రహమునకై బుద్ధి మరలినది.

తరువాత నిక వ్యాకరణ విద్యాప్రవీణ పరీక్షకు ప్రైవేటుగా కట్టవలెనను పూనికయు నాలో నేర్పడినది. దానితో

ముక్తావళి అప దేవీయము చదువవలసి వచ్చినది. అంతకుముందే నామనసులో కొంత ఆధ్యాత్మిక చింత చిన్ననాటినుండియుఁ గలదు. అది కలుగుటకు పొడగట్లపల్లిలోని వేదవిద్వాంసులు, సమీపమందున్న వసిష్ఠానదిలో అనుదినము నియమముతో స్నానసంధ్యాద్యనుష్ఠానములు బ్రహ్మయజ్ఞములు చేయుచుండుట, సాయంకాలపు వేళ పెద్దలందఱు చెఱువునకు ఈశాన్యమునందున్న ఊతిఘట్టమునకు జేరి సంధ్యవార్చుట జరుగుచుండుటచే, ఆనాఁడు పిన్నలమైన మావంటివార మందఱము ఆ పనులు చేయుట కలవాటు పడినాము. పవిత్ర నదులలో స్నానము చేయుట సకాలమునకు సంధ్యవార్చుట మున్నగు బ్రాహ్మణ కృత్యములు చేయువారికి కలుగుననుకొన్నను అనుకొనకపోయినను పుణ్య సంస్కారము కలుగమానదు. అది సన్మార్గమును చూపించకపోదు. ఆనాఁడు పొడగట్లపల్లిలో వేదము చదువుకొను విద్యార్థులు విశేషముగ నుండెడివారు. ఏమూలకు పోయినను వేదనాదము చెవులబడుచునే యుండినది. అదికూడ కొంత సహకరించి, నేను నమకము ఉపనిషత్తులు శీక్షాఆనంద భృగువల్లులు వర్ణించి పారాయణము చేయుట జరుగుచువచ్చినది. ఇది యిట్లుండ, రాధాకృష్ణన్‌గారు రచించిన భారతీయ తత్త్వశాస్త్రము నీమధ్య ననువదించిన శ్రీ బులుసు వెంకటేశ్వర్లుగారు మా గ్రామస్థులు. వారు వివేకానంద జీవిత చరిత్రమును ఆ యూరిలోనుండియే యనువదించి యున్నారు. అప్పుడును వారితో నాకు కొంత స్నేహముండినది. వారితో జరిపెడి సంభాషణముకూడ నాలో నాధ్యాత్మిక చింతన కొంత హెచ్చించినది. ఆ రోజులలో భగవద్గీతను అష్టాదశాధ్యాయము

లను కంఠస్థము చేసినాను. మఱియు శ్రీ శంకర భగవత్పాద విరచిత వివేకచూడామణిని కూడ పలుమాఱు లావర్తించుచుండెడివాఁడను. కొంత మేరకు శంకరానందీయమును చూచుట తటస్థింపగా, ఆధ్యాత్మికముగా నిత్యజీవితమునుగడపుట కుపాయమేమయియుండునను జిజ్ఞాసలో లీనమై, సన్మార్గోపదేశ శ్రవణమునకై నేను గురువరేణ్యులు శ్రీ కొల్లి రామజోగీశ్వర శాస్త్రి గారిదగ్గఱ, ప్రధానముగ వేదాంత పంచదశిని, దానితో పాటు న్యాయశాస్త్ర ముక్తావళిని చదువుటకు 'ఇరగవర' గ్రామమును జేరితిని. అప్పుడొక మండలము చదువు సాగినది.

శ్రీ రామజోగీశ్వరశాస్త్రిగారప్పటికి ఆత్మానుసంధానమున ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతములను ఓడ్చి వడఁబోసి, భారతీయార్ష సిద్ధాంతములను త్రికరణశుద్ధిగా నలవఱచుకొని, నిరంతర వేదాంతార్థానుసంధానమున ముక్తిమార్గపథికులై యుండి దివ్య గార్హస్థ్యమును నిర్వహించుచుండెడివారు. అట్టి వారు నన్ను శిష్యునిగా స్వీకరించుట కంగీకరించి, వేదాంత పంచదశితో పాటు ముక్తావళినికూడ నాచే పఠింపఁజేసిరి. వారికి ప్రవేశములేని శాస్త్రములేదు. న్యాయశాస్త్రము పూర్వోత్తర మీమాంసలు వారికి వాచో విధేయములు. వారి జ్ఞానోపదేశ పద్ధతి లోకవిలక్షణము. అనుభూతి ప్రదర్శన సమన్వితమును. మఱుచటి వత్సరము మఱి మూడుమాసము లుండి వారిదగ్గఱనే దినకరి, వ్యుత్పత్తివాదము చదువుట సంభవించినది. అప్పుడును ఉదయమున వేదాంత పాఠమునకు జేయవలసిన శాంతులుచేసి, ఆమీఁద తర్కపాఠము నారంభించుచుండెడివారము. అనిర్దిష్టముగ తఱుచు, వేదాంతప్రవిషయ ప్రవచనమే జరుగుచుండెడిది.

ఆర్ష సిద్ధాంతములే పరమ సత్యములని నిరూపించు పూనిక నాలో నేమయిన మిగిలియుండిన, నా రచనలో నెచటనైన ఆర్ష వాక్యములు సత్యములని నిరూపించు ప్రయత్నము చూపట్టిన అది మా గురువర్యుల సదుపదేశఫలమే. నాలో నేపాటియయిన ఆధ్యాత్మికచింత నిలిచియుండినది కూడ వారి సదుపదేశఫలమే యని నా భావన.

నాకు పిడప ర్తి చినపూర్ణయ్య సిద్ధాంతిగారి కుమారులు శ్రీ కృష్ణమూర్తి శాస్త్రిగారు పరోక్షముగ గురువులు. వారు వారి సోదరులు మా తండ్రిగారి దగ్గఱ వ్యాకరణశాస్త్రము కొంత యభ్యసించినవారు. తన్మూలముగ వారికి మామీద వాత్సల్య మధికము. అందును శ్రీ కృష్ణమూర్తి శాస్త్రిగారి ప్రతిభ విలక్షణమైనది. వారికి జ్యోతిశ్శాస్త్రమునందేగాక వివిధ శాస్త్రములందును, సంస్కృతాంధ్ర భాషలలో ఉపన్యసించుట, సంస్కృతాంధ్ర గ్రంథములు పురాణము చెప్పుట మున్నగు ప్రజ్ఞ లెన్నియో గలవు. అవన్నియు తమకుఁ గలవని చెప్పుట మమ్మును కలిగించుకొమ్మని చెప్పుట వారికి పరిపాటిగా నుండెడివి. వారికున్న ప్రజ్ఞలను మనమేల సాధింపలేమను స్పర్థతోనే అలంకార శాస్త్రగ్రంథములను సాధించి పాఠము చెప్పుట, పూర్వమీమాంసలో ప్రవేశము కలిగించుకొనుట, సంస్కృతాంధ్ర భాషలలో నుపన్యాసము చేయుట, దానితోపాటు హిందీభాషలో ధారాళముగ నుపన్యసించుట, మూడుభాషలలోను పురాణగ్రంథములు చదివి చెప్పుట నాకలువడినది. 1936 మొదలు 1942 వఱకు నేను నా సోదరుడు వీరభద్ర శాస్త్రియు కలిసి పాశ్చిమ గోదావరిజిల్లా గ్రామములలో

పురాణము చెప్పుచు కొంతసేపు గడించినాము. పురాణము చెప్పుట నాచే నారంభింపజేసినవారు మా గురువర్యులు రామ జోగీశ్వర శాస్త్రిగారే.

పాడగట్లపల్లి పాఠశాలలో ఉపాధ్యాయ వృత్తియందుండియే విద్యాసంస్కారము నంతయు కలిగించుకొనుట జరిగినది. తెలుగులో పురాణము చెప్పదలంచిననాడు ఆంధ్రభాషలో ప్రవేశము కలిగించుకొని, విద్యార్థులకు పాఠ్యగ్రంథములు పఠింపజేయుచు దానిని కొంత వృద్ధిచేసికొనుట జరిగినది. ఈవిధముగ పాఠశాలలోని యుద్యోగము మా తమ్ములకొప్పగించుచు, కుటుంబమును దిద్దుకొనుచు, విద్యాసంగ్రహము చేయుచు 1937 లో వ్యాకరణ విద్యాప్రవీణ ప్రిలిమనరీ పరీక్షలో నుత్తీర్ణుండనై, 1939 లో ఫైనలు పరీక్షకై · భూషణసారము లఘుమంజూష చదువుటకు రాజమహేంద్రవరము మా లక్ష్మీనారాయణ శాస్త్రిలవారి దగ్గఱకుం జేరితిని. పాఠ్యవిషయములు చదువుకొని పరీక్షావ్యాసంగము చేయుచుండఁగా నొకసంఘటన మేర్పడినది. ఆ సంఘటనము నన్ను ఆంధ్ర సాహిత్యపరిషత్తులో మేనేజరు పదవికి రప్పించినది.

## —: ఆంధ్ర సాహిత్య పరిషత్తులో ప్రవేశము :—

రాజమహేంద్రవరములో భూషణసారముచదివి మంజూష చదువుచుండఁగా మాకు సతీర్థ్యుఁడు, ప్రియమిత్రుడు శ్రీ దర్భా కృష్ణమూర్తి, సీతమ్మపేటలో కాపురము చేయుచుండెడివాడు. 1938 డిశంబరు 13 వ తేది ప్రాంతములో నామిత్రునింటికిం జూడఁబోయితిని. ఏదో ప్రసంగము జరుగుచుండఁగా నామిత్రు

నికి, కృష్ణమూర్తికి, ముక్తీశ్వరములో నుండిన వాని సోదరీ భర్త దగ్గఱనుండి 'నేను నీ యుద్యోగము విషయమై జయంతి రామయ్య పంతులుగారితో మాటాడినాను. నీకు పరిషత్తులో పనిచేయుటకు సరిపడిన తెలుఁగు భాషాజ్ఞానము లేదనియు, అందుచే దానికై యత్నింపవలదనియు, చెప్పినారు' అను వార్త వచ్చినది. వెంటనే నా మిత్రుఁడు నన్ను 'నీకు అక్కడ పని చేయుటకు సరిపడిన జ్ఞానమున్నదికదా! నీవు యత్నించరాదా' అని హెచ్చరించినాఁడు. నేను వెంటనే వానికిట్లు బదులుచెప్పినాను. "నాకుమాత్రము సరిపడినంత తెలుఁగుజ్ఞాన మేమున్నది? అదియునుగాక నాకు డిగ్రీ ఏమియు లేదు. రికమండేషన్లు లేనిదే యీ దినములలో ఉద్యోగము రానేరాదు. మన మెవరిని పట్టుకొనఁగలము? అందుచే నేను ఇప్పుడు పరీక్షకు చదువుటమాని దీనికై యేల యత్నింపవలెను?" అని బదులుచెప్పి నిష్ప్రయత్నముగ నుంటిని.

ఇంతలో మార్గశీర్ష బహుళ సప్తమినాఁడు మా తండ్రిగారి ఆబ్దికమును పెట్టుకొనుటకై నేను పొడగట్లపల్లికి వెళ్ళవలసి వచ్చినది. అప్పటికి నా కిద్దరు మగసంతాన మేర్పడియున్నది. ఆలుబిడ్డల యోగక్షేమ మరయుటకై మఱి రెండురోజు లక్కడనే యుండుట జరిగినది. ఇంతలో శ్రీ బులుసు వెంకటేశ్వర్లుగారి సోదరుఁడు నాదగ్గఱ కావ్యములు చదివిన శ్రీ బులుసు సీతారామశాస్త్రి నాదగ్గఱకు వచ్చి యీ క్రింది విధముగఁ దెలిపెను.

గురువుగారూ! ఆంధ్ర సాహిత్య పరిషత్తులో మేనేజరు పోస్టు ఖాళీయయినది. దానికి సర్వాధికారులు శ్రీ జయంతి

రామయ్య పంతులుగారు. వారిని నేను జూచి, ఆ పోష్టులో వేసికొనఁదలఁచినవారి అర్హతలను వారినుండి తెలిసికొని వచ్చితిని. వారు తెలిపిన విషయమిది. ఆ స్థానములో మేము వేయఁదలఁచినవారు సంస్కృత వ్యాకరణమును సమగ్రముగ చదివియుండవలెను. తెలుఁగులో మంచి పరిజ్ఞానము కలిగియుండవలెను. ఆంగ్లములో కొంచెము వ్యవహారజ్ఞానము కలిగియుండి నేను జేయు పరీక్షకు సరిపడినవారి నా స్థానమున నియమించెదను" అనినారు. అట్టి అర్హతలన్నియు మీకుఁ గలవు గావున మీరు యత్నించిన మీకు తప్పక యీ యుద్యోగము లభించును. మీరు తప్పక యత్నము చేయవలెను. వారు చేయు పరీక్షకూడ తెలుఁగు భారతము చేతికిచ్చి చదివించి నడుమ నడుమ ప్రశ్నలు వేయుచుందురు. ఆ పరీక్షకు మీరు నిలువఁజాలరా ?" అనినాఁడు సీతారామశాస్త్రి. దానిమీఁద నాకును వారెట్లు పరీక్షించెదరో చూచెదమనెడి కుతూహల మేర్పడినది. వారు పరీక్షచేయుటలో అప్లికేషను ఫారములో అరసున్నలు బండిరాలు కూడ పరికించెదరని తెలిపినాఁడుకూడ. మీరువెళ్ళి ప్రయత్నముచేసిన మీకు తప్పక ఆ స్థానము లభింపఁగలదని నా నిశ్చయము. మీరు వెళ్ళండి అని సీతారామశాస్త్రి నన్ను హెచ్చరించుట జరిగినది.

శ్రీ జయంతి రామయ్య పంతులుగారు చేయు పరీక్ష యెట్లుండునో ? చూడవలెనను కుతూహలము నన్ను ప్రేరేపించి డిసెంబరు 22వ తేదికి ముక్త్యేశ్వరము తీసికొని వెళ్ళినది. ఆనాఁడు ఉదయము 7 గంటలకు స్నానసంధ్యానుష్ఠానములు దీర్చుకొని

వారియెదుటఁ బడినాను. వారితో సంభాషణ మీ క్రిందివిధ ముగ కొనసాగినది.

ఏవూరు మీది? పొడగట్లపల్లి.

ఎందుకు వచ్చావు? ఆంధ్ర సాహిత్యపరిషత్తులో మేనే జరుపదవి నర్థించుటకు వచ్చినాను.

పొడగట్లపల్లినుండి వచ్చినవారిలో నీవు నాల్గవవాడవు.

కానివ్వండి.

నీ పేరు? చిలుకూరి పాపయ్యశాస్త్రి.

పంతులుగారి ప్రక్కనే యొక కుర్చీలో వారి తోఁటి యల్లుడు ధూళిపాళ రామ జోగీశ్వరరావు గారు అనువారు కూర్చుండి యున్నారు. వారు మా పెదతాతగారి బావమఱఁదులు. వారందుకొని చిలుకూరి చతుష్టయము నీ కేమగును? అనినారు. మా తాతలు. పంతులుగారు - మా కీ చతుష్టయములు పంచకములు అక్కఱలేదు. నీవేమి చదువుకున్నావు? అనినారు.

చిలుకూరివారేమి చదువుతారు. వ్యాకరణము అని రామజోగీశ్వరరావుగారే బదులు చెప్పినారు.

తెలుగు? అనినారు పంతులుగారు. విద్వాన్ పరీక్షకు పోయే విద్యార్థులకు పాఠము చెప్పుచున్నాను. అబ్బో! అనినారు. నీవేమి చేయుచున్నావు? పొడగట్లపల్లి సంస్కృత పాఠశాలలో ప్రధానోపాధ్యాయుఁడనుగా పనిచేయుచున్నాను.

ఇంగ్లీషు ఏమయిన చదివితివా? కొంచెము చదివినాను. సరే నిన్ను పరీక్షచేస్తాను ఉండు అనినారు.

పంతులుగారి కార్యక్రమములు అన్నియు నియమిత సమయములలో జరుగుచుండెడివి. 8 వ గంటవఱకు వారు చేయవలసిన కృత్యములు నిర్వర్తించి గడియారములో 8 కొట్టు చుండగా నౌకరును కేకవేసి అక్కడ ఆయనకు కుర్చీవేసి నా తలవైపునున్న భారతము తీసికొనివచ్చి ఆయనకిమ్ము అనినారు. ఆతఁడట్లు కుర్చీవేసి నన్ను లోనికి రమ్మనెను. నాకు భారతము చేతికిచ్చుచుండఁగా గడియారములో గంటలు కొట్టుట ప్రారంభ మైనది. అదిచూచి పంతులుగారి భార్య 'ఈయనకు పుస్తక మిచ్చుచుండఁగా గడియారము గంటలు కొట్టుచున్నది. ఈ ఉద్యోగము ఈయనకు కావచ్చునేమో? అనినారు. వీరికే అవుతుందో, మఱియొకరి కవుతుందో? ఎవరు చెప్పగలరు? అనినారు పంతులుగారు.

నాచేతికిచ్చినది నన్నయ్యగారి భారతము ఆది సభా పర్వములుండిన భాగము. పుస్తకము తెఱిచి వచ్చినచోట చదువుమనినంతనే శిశుపాలాధిక్షేప ఘట్టము వచ్చినది. సంస్కృతము బాగుగా చదువుకొని తెలుఁగులో కృషిచేసి, శ్రావ్యముగా పద్యము చదివేవారిని చూచిన పంతులుగారి కమితానందము. అది తెలిసిన నేనట్లు చదివినంతనే వారు సంతోషముతో తల యూపినారు. నాకు కొంత ధైర్యమును వచ్చినది. కొద్దిగా రాగాలాపముతో నేను కలిపి చదివినపుడు, పంతులుగారు, ఆ పద్యము మరల చదువుమనఁగా, నేను పదములు విడఁదీసి అన్వయానుసారముగా ఆఁపి చదువుచుండెడివాఁడను. భారతభాగములో వెనుకముందులు తెరిపించి, పదితావులందు చదివించినారు. ఇదికాదు తిక్కనభాగము నేమి చేసెదవో,

చూచెదమని, వారు లేచి వెళ్ళి బీరువాలోనుండి అనుశాసని కాది తుదిపర్వములున్న భారతసంపుటమును నాచేతబెట్టి చదువు మనినారు. ఆ భాగములో, ఎక్కడి కాఁపవలెనో అక్కడికి ఆఁపి చదువ మొదలుపెట్టితిని. ఆ భాగములో పది తావులలో వెనుకముందులు చదివించి, తుది నొక్క పద్యమునకు అర్థము చెప్పుమనఁగా, సులభముగా చెప్పివేయుటతో చాలులే అని, అరణ్యపర్వము తుదిభాగముకూడ మంగళాంతముగా చదివి పూర్తిచేయుమని నాచేఁ జదివించినారు. ఆ తరువాత ఇన్‌కమ్ టాక్సు రిపోర్టు భాగము నెదురుగానుండిన దానిని నాచేతి కిప్పించి చదువుమనినారు. నాలుగువాక్యములు చదివినంతనే చాలు కుక్షి పావనమైన దనినారు. అంతటితో నా పరీక్షా కార్యక్రమము ముగిసినది.

తరువాత నింకొక విధమయిన పరీక్ష ప్రారంభమైనది. నీకు పాఠశాలలో ఇచ్చే వేతనమెంత ? 45 రూపాయలు. ఇక్కడ అంతకంటె ఎక్కువ జీతము నిచ్చెదరని వచ్చితివా ? కారణ మదికాదు. నాకు కుటుంబము పెరిగినది. నాసోదరు లిరువురు నావలెనే చదివి పాఠశాలను నిర్వహింపఁగల స్థితిలో నున్నారు. వారిని మఱియొకచోటికిఁ బొమ్మనుటకంటె నేనే యింకొకచోటికి వెళ్ళుట భావ్యమని. ఆనాఁడు భోజనము వారి యింటనే జరిగినది.

భోజనసమయములో నీవు తెలుఁగు ఛందస్సేమైన చదివి తివా ? నేను తెలుగెవ్వరియొద్ద నేమియు చదువలేదు. స్వయ ముగనే చూచితిని. ఏ యే గ్రంథములు చూచితివి? కవిజ నాశ్రయము, అనంతుని ఛందస్సు, సులక్షణసారము అప్పక

మీయము మున్నగు గ్రంథములు చూచితిని. సరియే. భోజనా నంతరము కొంచెముసేపుండి సెలవిచ్చిన పోయివచ్చెద నంటిని. సరే. నీకు చెప్పకపోవుటయేమి ? బహుశః నిన్ను ఆ స్థాన ములో వేసికొనవచ్చును. నీవుగాక నా దృష్టిలో మఱియిద్ద రున్నారు. వారిని నిన్ను కాకినాడలో మగల కార్యదర్శుల దగ్గఱ పరీక్ష చేసెదము. దానికై నీవు కాకినాడకు రావలెను. వచ్చునప్పుడు 27 వ తేదీకి రాజమండ్రివచ్చి, మా రామజోగీ శ్వరరావుగారి యింట నన్ను గలియుము. నేను కాకినాడకు ఎప్పుడు వచ్చునది, నీవెప్పుడు రావలసినది చెప్పెదననినారు. సరేయని పాడగట్లపల్లికిపోయి, 27 వ తేదీకి వారిని గలిసి, మాటాడగా 29 సాయంకాలము కాకినాడ రామారావుపేటలో నాబసలోఁ గలియుమని ఆదేశించినారు. ఈవిధముగ రాపో అనుటకూడ నన్ను పరీక్షించుటకే అని తరువాతఁగాని నాకుఁ దెలియలేదు. 29 న కాకినాడలోఁ గలియుఁగా మఱునాఁడు ఉద యము 8 గంటలకు ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమునకు కార్యదర్శులయెదుట జరిపే పరీక్షకు రమ్మని తెలిపినారు.

ఈ పరీక్ష వెనుకటివలెనే శాంతిపర్వము చేతికిచ్చి ఒకే ప్రకరణమున ముగ్గురిచేత చదివించిరి. ఆ సమయములో మా అర్హతలు నిర్ణయించుటకు, పంతులుగారు కార్యదర్శు లిద్దరు, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారును, జేరిరి. పరీక్షించిన వారిలో మిగిలిన యిరువురికు ఆనాఁడు తెలుఁగులో పరిజ్ఞానము నాకంటె హెచ్చనుట నిశ్చయము. కాని వారిరువురకంటె నాకుఁగల విశే షము ఆంగ్లములో కొంచెము పరిజ్ఞానము. దైవాను కూల్య మును. తన్మూలముగ నన్నాస్థానమున నియమించుట జరిగినది.

తరువాత నన్నా స్థానమున నియోగించినందులకు శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రిగారివంటి పెద్ద పండితులు పంతులుగారి నిర్ణయమును మెచ్చుకొనుటయు జరిగినది. ఈ యుద్యోగము తమకు లభింప లేదనుకొన్నవారు కొందఱు పంతులుగారిని దూషించుటయు జరిగినది. తరువాత పెద్దలు మెచ్చుకొనుట హెచ్చుగ నుండుటచే నన్నా స్థానమున నియమించినందులకు పంతులుగారు గర్వపడుచుండెడివారు. 1939 జనవరి 23 వ తేదిని వచ్చి ఆంధ్ర సాహిత్య పరిషత్తు కార్యాలయములో మేనేజరు పదవిలోఁ జేరినాను.

ఆంధ్ర సాహిత్య పరిషత్తులో అడుగువెట్టిన యొక్క సంవత్సరమునకుఁగాని పరిషత్తులోనుండిన వస్తుజాతమేమో, అది యే యే విభాగములకుఁ జెందినదో, దాని యుపయోగమెట్టిదో నాకేపాటియు బోధపడలేదు. కాకినాడ నాకు చిన్నప్పటినుండియు బరిచితమగుటచేతను, పండితమిత్రు లెందరో నాకు పరిచితులైన వారిక్కడ నుండుటచేతను, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయము పిఠాపురములో పనిచేయుచు, అచటిపండితులందఱు నాకుసహాకరించుచుండుటచేతను, అప్పుడు కార్యదర్శులుగా నుండిన శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు శ్రీ వింజమూరి వెంకన్న పంతులుగారు పండితుల నాదరించెడి సౌజన్యముగలవారు కార్యదర్శులుగానుండి నాచే కార్యములను నిర్వహింపఁ జేయుటచేతను, నేను క్రమముగా పరిషత్కార్యాలయమున పనిచేయఁ గలిగితిని. పరిషత్కార్యాలయ ప్రవేశమును బట్టియే నేను తెలుఁగులో రచన సాగించుటగాని, ఈనాఁడొక రచయితగా లెక్కింపఁబడుటకాని జరుగుచున్నది. అందుచే ఈనాఁడు

కీర్తిశేషులైన శ్రీ జయంతి రామయ్య పంతులుగారికిని, వారు స్థాపించి పోషించిన ఆంధ్రసాహిత్యపరిషత్సంస్థకును నే నాజీవము కృతజ్ఞుడనై యుంటిని. ఉండవలయును కూడ.

—: వ్యాసరచనా ప్రారంభము :—

పరిషత్తులో ప్రవేశించిన తరువాత వ్యాకరణ విద్యా ప్రవీణ ఫైనలు పరీక్షకు వెళ్ళుట జరిగినది. ప్రథమశ్రేణిలోనే ఉత్తీర్ణుడనైనాను. ఆ తరువాత క్రమముగా పరిషత్తులో చేయ వలసిన పనులను అవగాహన చేసికొనుచు నిర్వహింప మొదలు పెట్టితిని. పరిషత్పత్రికా సంపాదకత్వము నాపేర లేకున్నను, దానిని ప్రకటించుటకు చేయవలసిన పనులన్నియు నేనే నిర్వ హించుచుండుట జరిగినది. ఒక వత్సరము పూర్తియగునప్పటికిఁ గాని కాగితముమీఁద కలముపెట్టి వ్యాసములు వ్రాసే స్థయి ర్యము చిక్కలేదు. ముందుగా కావ్యాలంకార చూడామణి పాఠభేదములనుగూర్చి యొక వ్యాసము వ్రాసి, మూఁడు తాటి యాకు ప్రతులనుండి సంగ్రహించిన పాఠభేదములను పరిషత్ప త్రికలోనే ప్రకటించినాను. ఇది నా రచనకు ప్రారంభము. తరువాత కొంతకాలమునకు పరిషత్పుస్తక భాండాగారము తృతీయ సంపుటమును వ్రాసి ప్రచురించినాను.

ఆంధ్రభాషలో అడుగుబెట్టినవారికి మిగిలిన కవుల రచ నలకంటె అత్యాకర్షకమైనవి శ్రీనాథుని ప్రబంధములు. ఆనాటికి నన్నయాదుల కవితా విమర్శనముకంటె శ్రీనాథుని కవితపై విమర్శన గ్రంథములు, వాదోపవాదములు హెచ్చుగ బయలు దేరినవి. అందును సంస్కృతభాషలో విశేషపరిజ్ఞానము గల

వారికి శ్రీనాథుని రచనలపై ప్రత్యేకదృష్టి యేర్పడుటకూడ సహజమే. అప్పటికి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శృంగార శ్రీనాథము, క్రీడాభిరామపీఠిక మంచి ప్రామాణిక విమర్శక గ్రంథములుగా వన్నెకెక్కియున్నవి. వానిని జూచుచునుండఁగనే, పిఠాపురము విద్యానంద లైబ్రెరీలోనుండిన చమత్కారచంద్రిక తాటాకుప్రతి తెచ్చి పరిషత్తునకై నేను కాపీచేయుట తటస్థించినది. ఆ గ్రంథము ప్రతాపరుద్ర యశోభూషణమువలె, అలంకారశాస్త్రి విషయములతోనిండి, రసార్ణవసుధాకర కర్తయైన రావు సింగభూపాలున కంకితమైనది. దానిలో నొక శ్లోకములో ఆ సింగభూపాలునకు సర్వజ్ఞబిరుద ముండినట్లు నాకుఁ గనఁబడినది. అతనికి సర్వజ్ఞబిరుదము లేదని, చమత్కారచంద్రికలోఁ గానరాదని ప్రభాకరశాస్త్రిగారు శృంగార శ్రీనాథములో గట్టిగా నొక్కి చెప్పినారు. అందుచే శ్రీనాథుఁడు సరస్వతీ స్తుతి పూర్వకముగా దర్శించిన సింగభూపాలుఁడు పోతన రచించిన భోగినీ దండకములో ప్రస్తుతుఁడైన అతని మనుమఁడైన సింగభూపాలుఁడే కాని, రసార్ణవ సుధాకర కర్త కాఁజాలఁడని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన వ్రాఁతలు పూర్వోత్తర విరుద్ధములని నిరూపింపఁ దలపెట్టి, నా యూహల నటునిటు పెద్దలతో ప్రసంగింప మొదలు పెట్టినాను.

ఈప్రసంగము జరుగునప్పుడే 1940లో విద్వాన్ పరీక్షకు కట్టి ప్రశ్నోత్తరములు వ్రాయుటకు మదరాసు వెళ్ళినాను. ఆ పరీక్షావిషయము ముగిసిన తరువాత శ్రీ నేలటూరి వెంకట రమణయ్యగారితో పరిచయము చేసికొనుటకు వారి హిస్టరీ డిపార్టుమెంటుకు పోయినాను. అంతకుముందే వారు ఆంగ్లో

పోద్ఘాతముతో వెలుగోటి వంశావళి ప్రకటించి యున్నారు. వారితో ప్రసంగించు ప్రకరణములో శృంగార శ్రీనాథములో ప్రభాకరశాస్త్రిగారు, రసార్ణవ సుధాకర కర్తకు సర్వజ్ఞ బిరుదము లేదనియు, చమత్కార చంద్రికలో కానరాదనియు వ్రాసినారు. చమత్కార చంద్రికలో కలదే!' అని నేననినంతనే తరువాతి ప్రసంగ మాఁపివేసి, నన్ను తమవెంటఁ దీసికొని సంస్కృత కక్ష్యలో ఇప్పుడు ప్రొఫెసరుగానుండిన డాక్టరు రాఘవన్‌గారి దగ్గఱకుఁ గొనిపోయి, వారికి నాపరిచయము కలిగించి నేను చెప్పెడి విషయమును వారికిఁ జెప్పుమనిరి.

శ్రీ రాఘవన్‌గారికి 'చమత్కార చంద్రికలో రసార్ణవ సుధాకర కర్తకు సర్వజ్ఞ బిరుదము కలదని తెలుపు శ్లోక మున్న' దని నే నంటిని. దానిని చూపించెదరా? అని వారు ప్రశ్నించిరి. చూపించెదనని నే నంటిని. వెంటనే మేము ముగ్గు రము కలసి మేడక్రిందనుండిన మాన్యుస్క్రిప్టు లైబ్రరీకిపోయి చమత్కారచంద్రిక వ్రాతప్రతిని తెప్పించి కొన్నిపుటలు తిరుగ వేసి, ఆ శ్లోకమును వారికిఁ జూపించితిని. దానితో శ్రీ రాఘవన్ గారికి నాయెడల సద్భావమేర్పడినది. నేనును రసార్ణవ సుధాకర కర్తకు సర్వజ్ఞబిరుదు కలదని యితర గ్రంథోదాహరణములను బట్టి తెలుపుచుండినను, వీ రంగీకరించుట లేదని, బొమ్మగంటి అప్పయార్యుని రచననుగూర్చి వారు వ్రాసిన వ్యాసమును నా కిచ్చిరి. నాఁడు మొదలు నేటివఱకు శ్రీ రాఘవన్‌గారు నా కాప్తమిత్త్రులుగనే యున్నారు. వారితోపాటు శ్రీ నేలటూరి వెంకట రమణయ్యగారును. ఆ వెనుక శ్రీ రాఘవన్‌గారికి పరిష ద్భాండాగారములో నుండెడి సంస్కృత ప్రతుల వివరములను

గూడ వ్రాసి పంపుట జరిగినది. దానితో పరిషద్భాండాగారము నందలి ముద్రితాముద్రిత వ్రాఁతప్రతులతోను వానికిఁ గల ముద్రిత ప్రతులతోను విశేషపరిచయ మేర్పడినది.

క్రమముగా సర్వజ్ఞభూపాలుని విషయమున నాయూహ లను దెలుపుచు రసార్ణవ సుధాకరము - చమత్కార చంద్రిక గౌరన లక్షణదీపిక, సర్వజ్ఞ సింగభూపాలుఁడు, పోతన, అను వ్యాసములను వ్రాసి పరిషత్పత్రికలో ప్రకటించితిని. 1940 ప్రాంతములో నేను నా శత్యాప్తమిత్రుడు శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి 'ఆంధ్రి' అను పత్రికను ప్రకటించు చుండెడివారు. దానిలో కళలు - కావ్యకళ, కావ్యతత్త్వము, కుమారస్వామి సోమయాజి ఇత్యాదిగా కొన్ని వ్యాసములు ప్రకటించుచు వచ్చితిని. అప్పటికి 'విద్వాన్' పరీక్షలో ఉత్తీర్ణుడ నైతిని. పరిషత్కార్యములు నిర్వహించుటలో కూడ స్వాతం త్ర్యము లభించినది. పెద్దలయిన కొందఱకు నాయెడల సద్భా వము కొంత యేర్పడినది. కొందఱకు నా వ్రాఁతలపై కొంత ఆగ్రహము కలిగినది. నేనును దేశకాలములను కొంత అవ గాహనము చేసికొనఁగలుగు స్థితికి వచ్చితిని. అప్పటికి నా రచన వ్యాసరూపముననేయుండినది. నేనేది వ్రాసినను దానిలో చాల వఱకు ప్రభాకరశాస్త్రిగారి రచనలను పేరెత్తి ఖండించుచు వచ్చుట జరిగినది. దానితో నా దివసములలో వారు నాపై నాగ్రహించుట తటస్థించినది.

1941 తుదిలో శ్రీ జయంతి రామయ్య పంతులుగారు కీర్తిశేషులగుట, వారి స్థానమున కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి గారు పరిషదధ్యక్షులుగను, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు

సంపాదకులుగను నియమింపబడిరి. 1942 మార్చిలో అంతకు ముందు పిఠాపురములో పనిచేయుచున్న నిఘంటు కార్యాలయము కాకినాడలోని పరిషత్కార్యాలయము దగ్గఱకు తీసికొనివచ్చుట జరిగినది. మా సోదరులిద్దరు ఆ కార్యాలయములో పనిచేయుచుండెడివారు. ఆ సంవత్సరమునందే శ్రీ సుబ్బయ్యశాస్త్రిగారు నన్ను పరిషత్కార్యాలయమునుండి, నిఘంటు కార్యాలయములో పనిచేయు పండితునిగాఁజేసి, నా సోదరుఁడు విశ్వనాథశాస్త్రిని పరిషత్తులో నా స్థానమున నియమించిరి. దానితో పరిషత్తుబాధ్యత నంతయు నిర్వహించుచునే నిఘంటు కార్యాలయమున పనిచేయవలసి వచ్చినది. నిఘంటుకార్యాలయములో పనిచేయుటవలన నాకు సంస్కృతాంధ్ర సాహిత్యములలో కొంత గట్టితన మేర్పడినది. ఆ కార్యము చేయుచున్నంతలోనే నేను కొన్ని పద్యములు వ్రాయుట, వ్యాసములు తఱుచు వ్రాయుచుండుట జరిగినది. వానిలో కొన్ని భారతిలోను ముద్రితములైనవి. కాశీఖండము - పాఠభేదములు, సూరిగారి సూత్రాంధ్రవ్యాకరణములు - భీమేశ్వర పురాణము - కొన్ని స్థలవిశేషములు కవిరాజ శిఖామణి కల్పనావైచిత్రి మొదలయిన వ్యాసములు భారతిలో ప్రకటితము లయినవి. ఆనడుమనే మైథిలీశరణగుప్త రచించిన 'పంచవటి' అను ఖండకావ్యమును పద్యరూపమున అనువదించి, ప్రకటించుట కనుమతిని పొందికూండా విరమించితిని.

1945 డిసెంబరులో నా సతీమణి తాను కన్న యిద్దఱు మగబిడ్డలను నాకు వదలి తాను స్వర్గధామ మలంకరించినది. తరువాత నేను నిఘంటుకార్యాలయమున పనిచేయుట మానివేసి

1946 ఫిబ్రవరిలో పరిషత్కార్యాలయమునకు వచ్చివేసితిని. ఆ జూన్ నెలలోనే పరిషత్కార్యాలయము శ్రీ ప్రభల సుందరామ భవనములోనికి మారినది. ఆ సెప్టెంబరులో నేను మరల దాక్షా రామమునకు సమీపమునందున్న 'కుడుపూరు' గ్రామమున దారపరిగ్రహము చేసితిని. నడుమ నొక యేడాదిపాటు మానసికమైన వ్యధచే నేపాటియు వ్రాయలేక పోయినాను. నాగృహిణి మగల కాపురమునకు వచ్చి నా బిడ్డలను తన కన్నబిడ్డలవలె చూచుకొనుట మొదలుపెట్టిన దాదిగ, మరల కలము నెత్తి వ్రాయుట జరిగినది. 1948 లో సోడ్ఢలుఁడు రచించిన 'ఉదయ సుందరీకథా' అనుదానిని సంతకుముం దనువదించి యుంచితిని. ఆ వత్సరముననే నేను కార్యాంతరమునకై తిరుపతి, మదరాసు వెళ్ళితిని. అప్పటికి ప్రభాకరశాస్త్రిగారు తిరుపతి ప్రాచ్యవిద్యా సంస్థలో పనిచేయుచున్నారు. వారిని నేను దర్శింపఁబోఁగా వారన్నమాటలివి. 'శాస్త్రిగారూ! మిమ్మల్నిగూర్చి నేనీవఱకు వ్యతిరేకాభిప్రాయములో పడియున్నాను. తరువాత మీరు నిఘంటు కార్యాలయములో పనిచేయుచున్నప్పటి విషయములు విని నా అభిప్రాయము మార్చుకొన్నాను. మీరు నావలెనే యితరు లేమనుకొన్నను లెక్కచేయక మీకు సత్యమని తోఁచిన దానిని చెప్పువారని తెలిసికొన్నాను. మీరు బాగా అభివృద్ధి లోనికి రావలెనని నేనాకాంక్షించు చున్నాను. ఇప్పుడు ప్రారంభముకానున్న తెలుఁగు భాషాసమితిలో మీరుండి పనిచేయుట భావ్యము. మీరు యత్నము చేయండి. నేనుకూడ సహకరించెదను' అని చెప్పినారు.

కాని ఆ తరువాతి నెలలోనే పరిషత్తునుండి మారి

హైస్కూలులోనో, కాలేజీలోనో ఉపాధ్యాయుఁడనుగా పని చేయవలెనను యత్నము నాలో తీవ్రమై, భీమవరములోను, కాకినాడలోను కళాశాలా ప్రవేశమునకు యత్నము చేసినాను. అప్పుడు కాకినాడలో పీఠికాపురాధీశ్వర కళాశాలకు పొన్ను స్వామి అయ్యరుగారు ప్రిన్సిపాలుగా నుండిరి. వారంతకుముందు మూఁడేండ్లనుండి నన్ను వారి హైస్కూలులో ప్రధానపండితుఁడుగా పనిచేయుటకు రమ్మనుచుండిరి. మీరీయఁ దలఁచిన కాలేజీలో పండితునిగా చేయండి. హైస్కూలులో మాత్రము వద్దు. అనుచుండెడివాఁడను. ఆయేడు వారు తమ పదవినుండి విరమించుచు ఆ కళాశాలలో నన్ను పండితునిగా వేయుట తుది పనిగాఁజేసి, నన్నుగుఱించి యెన్నో మంచిమాటలు వ్రాసినారు. 1948 జూలై 10 వ తేదిని నాకు కాకినాడ కళాశాలలో పనిచేయుటకు ఆర్డరు వచ్చినది. ఆనాఁడే భీమవరం కాలేజీలో జేరుటకు రమ్మని తంతియు వచ్చినది. పరిషత్తులో నేర్పడిన సంబంధమును వదలలేక కాకినాడ పీఠికాపురాధీశ్వర కళాశాలలోనే చేరుట జరిగినది. ఆనాటినుండి నేటివఱకు, మధ్యలో కొన్ని సుడిగాలులు వీచినను దైవానుగ్రహముచే చెదరిపోకుండ పీఠికాపురాధీశ్వర కళాశాలలోనే ఉపన్యాసక వృత్తితో కాలము గడుపుచు శక్తికొలది ఆంధ్రసాహిత్య పరిషత్సేవ చేయుచు నుంటిని.

## —: గ్రంథ ప్రకటనము :—

అంతకుముందు నేను రచించియున్న 'ఉదయసుందరి' అను సంస్కృతానువాదము శ్రీ దివాకర్ల వెంకటావధానులు గారి తోడ్పాటువలన నెల్లూరు జయలక్ష్మీ కంపెనీవారు ముద్రిం

చుట, అది ఇంటర్‌మీడియెట్ వారికి పాఠ్యముగా నిర్ణయింపఁబడుటయు జరిగినది. నాపేరుతో ముందుగా గ్రంథరూపమున ముద్రితమై ఆంధ్రలోకమునకుఁ బరిచయముచేసిన దా గ్రంథమే. ఆ వెనుక 1950 లో మరల నా యుద్యోగమును నిలువబెట్టుకొనుటకై హిందీ భాషాప్రవీణ పరీక్షలోఁ గూర్చుండవలసి వచ్చినది. ఆ పాఠ్యగ్రంథములు చదువునపుడు జాయసి రచించిన 'పద్మావత్' అను హిందీ ప్రబంధము చదువవలసి వచ్చినది. తరువాత దానిలోని కథాభాగమును తెలుగుచేసి 'పద్మావతి' అను నామకరణము చేసితిని. దానిని కూడ జయలక్ష్మి కంపెనీవారే ప్రకటించిరి. ఆ తరువాత 'విజయవిహారము' అను పద్యకావ్యమును వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారి సహకారముతో ప్రకటించినాను. విజయవిహార మనఁగా అర్జున పాశుపతాస్త్ర ప్రాప్తి ఘట్టము. దానిని మా గురువర్యులు శ్రీ కొల్లి రామజోగీశ్వర శాస్త్రిగారి కంకితము చేసినాను. అటుతరువాత పలివెల కొప్పులింగేశ్వరస్వామి చరిత్రమును 'కుసుమకుంతలము' అను కావ్యముగా రచించి ప్రకటించినాను.

1943 లో నేను కాలేజిలో అడుగుపెట్టినది మొదలుగా ఇంటరుగ్రూపు తెలుఁగులో ఛందో వ్యాకరణాలంకారములను బోధించుపని నామీఁదఁ బడినది. సిలబస్సునుబట్టి ఆ విషయములను బోధించుట అంతకుముందు అలవాటులేనిపని. ఆ విషయములను బోధింపవలసి వచ్చినపుడు సిలబస్సునుబట్టి నోట్సు సిద్ధము చేసికొని, విద్యార్థులకు బోధించుట మొదలుపెట్టఁగా, వ్యాకరణమనిన భయపడే విద్యార్థుల కా భయముతీరి, వారు తెలుఁగులో సులభముగా మంచి మార్కులు తెచ్చుకొనే

యవకాశము లభించినది. తరువాతి వత్సరములలో ఆ విష యములు నేనే బోధించుట తటస్థించినది. 1951 లో నేను వ్రాసియుంచిన ఆ నోట్సును సంస్కరించి 'ఆంధ్రలక్షణసారము' 1వ భాగము అను పేరున ప్రకటించితిని. ఆ పుస్తకమును నే నర్థింపకుండఁగనే ఇంటరు గ్రూపు తెలుగునకు ఆంధ్ర విశ్వవిద్యా లయమువారు పాఠ్యముగా నిర్ణయించిరి. తరువాతివారు దాని స్థానమున మఱియొకరు రచించిన గ్రంథమునుంచి దానిని తొలఁ గించిరి.

1955 లో దానిలోని విషయమునే సంగ్రహముచేసి ఆంధ్రలక్షణసారము రెండవ భాగమునుగా వెలువరించితిని. కళాశాలలలో దాని నెవ్వరు ఉపయోగించలేదుగాని, తరువాత తరువాత ఇతర విశ్వ విద్యాలయములలోను కొన్ని ఉన్నత పాఠ శాలలలోను దీనిని పాఠ్యముగా నుపయోగించు చున్నారు. ఈవిధముగా ఆ రెండుగ్రంథములు వాని యస్తిత్వమును నిలువ బెట్టుకొని యున్నవి.

1943 అక్టోబరు నెల భారతిలో భీమేశ్వర పురాణము కొన్ని స్థలవిశేషములు - అను వ్యాసము ప్రకటింపఁబడినది. తరువాత మఱికొన్ని విషయములు వ్రాసి పంపఁగా అవి తిరిగి వచ్చివేసినవి. అప్పటికి ఇప్పటికి భారతిలో వ్యాసములు ప్రచు రించుట ప్రచురింపకుండుట అటులనే జరుగుచుండెను. 1954లో శ్రీ చతుర్వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమునకు కార్యదర్శిగా వచ్చినారు. వారు నావలెనే పీఠికాపురాధీశ్వర కళాశాలలో సంస్కృతాంధ్రోప న్యాసకులు; నాకంటె పూర్వులును. వారాపని చేఁబట్టి పరిష

త్పత్త్రికకు వ్యాసములు వ్రాయుమని ప్రోత్సహింపగా, భీమేశ్వర పురాణము స్థలవిశేషములు అను శీర్షికను పునరుద్ఘాటించి, భీమమండల చరిత్రము నంతయు వ్రాసి పరిషత్పత్త్రికలో ప్రకటించుచు వచ్చినాను. క్రమముగా భీమేశ్వర పురాణములోని వివిధ విషయములనుగూర్చి వ్రాయుట జరిగినది. ఇంతలో పరిష ద్వార్షిక సభకు చరిత్రవిషయము నుపన్యసించుటకు వచ్చిన సహృదయ మిత్రులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 'శాస్త్రిగారూ! భీమేశ్వర పురాణమునకు సంబంధించి మీరు అపూర్వ విషయములు తెలుపుచున్నారు. శాసనాధారములతో ఆ యా విషయములు సమన్వయము చేయుచుఁగూడ వ్రాయండి అప్పటికి మీ పరిశోధనము సమగ్రము కాఁగలదు. నేను రెండు శాసనములు పంపెదను' అనిరి. తరువాత వారు పంపిన పద్య శాసనములను వివరించుచు భీమేశ్వర పురాణము శాసనప్రామా ణ్యము అను వ్యాసమును వ్రాసి ప్రచురించితిని. దానితో నా దృష్టి చారిత్రక విషయ పరిశోధనము వైపునకు మరలినది. తరువాత అంతవఱకు పరిషత్పత్త్రికలో ప్రకటించిన భాగము నకు 'శ్రీనాథ కృతి సమీక్ష' అని పేరుపెట్టి ఆంధ్రవిశ్వ విద్యా లయ పాఠ్యగ్రంథ నిర్ణేతల నర్థింపగా, వారు దానిని బి. ఏ. పరీక్షకు పాఠ్యముగా నిర్ణయించి యున్నారు.

క్రమముగా శ్రీనాథుని రచనలకు సంబంధించిన విష యము లన్నియు పరమ సత్యములనియు, శ్రీనాథుఁడు ఈశ్వరా ర్చన కళాశీలుఁడు అను విషయమును నిరూపింప వలయుననియు నామనస్సున స్థిరపడిననాఁటినుండియు నా విమర్శనమార్గములో మార్పు వచ్చినది. శ్రీనాథుఁడు భీమనాథునియెడ నమితభక్తి

గలవాఁడని నిరూపించెడి భావము నాలో హెచ్చయిననాఁటికిఁ నా యిల్లాలి పుట్టినిల్లు దాక్షారామమునకు సన్నిహిత మగుటచే, బలుమాఱులు రాకపోకలు సాగించి క్రమముగా క్రొత్తవిష యము లెన్నియో సంగ్రహించుట జరిగినది. క్రమముగా భార తిలో శ్రీనాథుని రచన లన్నిటిపైన నాకుఁ బొడగట్టిన యూహ లను వివిధములైన శీర్షికలతో ప్రచురించుట జరిగినది.

1958 లో అమలాపురములో బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు అధ్యక్షులుగను, శ్రీ మల్లాది గోపాలకృష్ణ శర్మగారు ప్రధాన కార్యదర్శులుగను ఇతర పండి తులు సాహిత్య ప్రియులు సభ్యులుగా నుండిన సాహితీసమితివారి వార్షికోత్సవములలో పాల్గొని శ్రీనాథుని రచనలపై నుపన్యసిం చుట జరిగినది. ఆ సాహితీసమితివారి ఆహ్వానముపైన ఆగస్టు 15 ప్రాంతమున మరల అమలాపురము వెళ్ళి నాలుగు దివస ములు అమలాపురములోనుండిన సాహిత్య సారజ్ఞులైన పెద్దలం దఱి సమక్షమున శ్రీనాథుఁడు శృంగారి కాఁజాలడనియు, ఆతఁ డీశ్వరార్చన కళాశీలుఁడనియు, అతని సర్వతోముఖమైన ప్రజ్ఞ యాతని రచనలలో నెల్లయెడల ప్రతిఫలించు చున్నదనియు ఇత్యాదిగ నామనసునందున్న విషయము లన్నియు నాకుఁ బొడ గట్టిన యుపపత్తులతోఁ దెలుపుకొంటిని. తరువాత అమలా పురమునందలి సహృదయుల సహకారముతో 'శ్రీనాథ కవితా సమీక్ష – శ్రీనాథుఁడు శృంగారియా !!' అను ప్రథమ సంపుట మును వెలుఁగులోనికి దేఁగలిగితిని. అంతకుముందే మిత్త్రులు శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ప్రోత్సాహమున, సరస్వతీ

పవర్ ప్రెస్సువారు ప్రకటించిన భీమేశ్వరపురాణమునకు విపుల మైన పీఠిక వ్రాసి యిచ్చితిని.

1959 లోనే శ్రీనాథుఁడు కాశీఖండములో రాజమహేంద్రవర్ణన ప్రస్తావములోఁ దెలిపిన వేదాద్రి నరసింహస్వామి అక్కడికి సమీపములోనుండిన కోరుకొండ నృసింహస్వామియే యని నిరూపింపఁబోయి, చేసిన పరిశోధన ఫలితముగా శ్రీనాథ కవితాసమీక్ష-రెడ్డిరాజుల చరిత్రము-అను ద్వితీయ సంపుటము వెలువరింపవలసి వచ్చినది. దాని ముద్రణమున కయిన వ్యయమును రెడ్డివంశజులనుండియే సంగ్రహించి ప్రకటించుట జరిగినది. నా కాప్తమిత్రులు శ్రీ బి. రామరాజుగారి తోడ్పాటుతో గా॥ డాక్టరు బి. గోపాలరెడ్డిగారు 19-7-61 ని కాకినాడకువచ్చి ఆ గ్రంథము నావిష్కరించి నన్నాంధ్రలోకమునకు విశిష్టముగ బరిచయము చేసినారు. ఆనాఁటి సభావిభవము శ్రీ గోపాలరెడ్డిగారు ఆనాఁడు నన్ను నా రచనను సభ్యులకు పరిచయముచేసిన విధానము నా జీవితములో మఱువరానిది. వేయిమంది సభ్యులు పురప్రముఖు లందఱు వచ్చి 3 గంటలు ఏపాటియు కదలకుండ నుండి సారస్వతసభ జరిగినతీరు, కాకినాడలో సుమారు 25 ఏండ్ల నుండి నే నెన్నఁడును చూచియుండలేదు. కాకినాడలో నాపేరున జరిగిన సభ అది యొక్కటియే. అంతవఱకు నేను చాలమంది పెద్దలకు అజ్ఞాతుఁడనే. అప్పటినుండియు సుజ్ఞాతుఁడ నగుట మొదలుపెట్టినాను.

అప్పటినుండియు శ్రీనాథుని రచనపై నే నటునిటు వివిధ విషయములపై వ్రాసిన విమర్శనవ్యాసములను ఏకసూత్రతకుఁ దెచ్చి మఱి మూఁడు సంపుటములలో ప్రకటింపవలయునని

సంకల్పమున్నది. దీనికి పరమేశ్వర సంకల్పము సమకూడుట లేదు. సాహాయ్యము చేయవలసిన సంస్థలకు సంబంధించిన వారి నర్థింపఁగా వారు నారచనలపై సానుభూతి చూపించుచున్నారు. కాని ఆర్థిక సాహాయ్యము మాత్రము లభించే శుభదివసములు వచ్చు నట్లు కానరాదు. ఏదోవిధముగ కావలసిన సామగ్రిని సమకూర్చు కొనే మూఁడవ సంపుటము భీమమండల చరిత్రమును కొంత వఱకు ముద్రించిన తరువాత, 1964 జనవరిలో శ్రీ చతుర్వేది మంగళ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ప్రత్యక్ష చరిత్రము నా స్వామి ప్రేరణచే రచించి ముద్రింపవలసి వచ్చినది. తన్మూలముగ ఈ భీమమండల చరిత్ర ముద్రణము పూర్తికాలేదు. పరమేశ్వరు నను గ్రహము లభించిననాఁడు బయటికి రావచ్చునని నాభావన. పూర్వజన్మార్జితమైనసుకృతము ఫలింపనినాఁడు మానవప్రయత్న మేపాటియు ఫలింపదనుట నా కనుభవసిద్ధమైన విషయము.

1961 సెప్టెంబరు నెలలో శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగారు నన్ను తణుకులో వారు నెలకొల్పిన నరేంద్రనాథ సాహిత్యమండలి పక్షమున 'కాకతీయులనాటి సారస్వతము' అను విషయమునుగూర్చి ఉపన్యసింపఁ గోరఁగా నేను పోయి ఆ సభలో పలనాటి వీరచరిత్ర రచనము సాగినది కాకతి గణపతి దేవునినాఁడనియు, దానిని రచించిన శ్రీనాథుఁడు పలనాటివాఁడే కాని కవిసార్వభౌముఁడు కాఁజాలఁడని నాకుఁ దోఁచిన యుప పత్తులతోఁ దెలిపియుంటిని. ఆ సభలోనే ఆనాఁడధ్యక్షులుగా నుండిన సారంగు నరసింహారావు పంతులుగారు, నాపరిశోధనను గూర్చి మెచ్చుకొని కాకతీయులు కమ్మవారో క్షత్రియులో తేల్చి చెప్పెదరని ముందుగనే యనినారు. నేను కాకతీయుల

నాటి సారస్వతమునుగూర్చి మాటాడి, తుదిని 'కాకతీయులకు సంబంధించిన చరిత్రమును సమగ్రముగాఁ దెలుపుట చాల కష్ట మనియు, తెలంగాణములో విశేష పరిశోధనము జరుగవలసి యున్నదనియు, ప్రతాపరుద్రీయమును సమగ్రముగా పరికించినఁ గాని యే విషయమును గూర్చియు నేనుగాని, మఱియొకరుగాని యే నిర్ణయము చేయుట సాధ్యముగాదనియు తెలిపితిని. కాని యా వెంటనే హైదరాబాదు పోయివచ్చుట సంభవించి, ఆ కాకతీయ చరిత్ర పరిశోధనముమీఁదికి దృష్టి మరలినది.

తిరుగుప్రయాణములో విజయవాడకు వచ్చి, నా రెడ్డి రాజుల చరిత్రముపై ఆంధ్రప్రభలో అభిప్రాయము పడలేదేమా? యని శ్రీ నీలంరాజు వెంకట శేషయ్యగారి నడుగఁ బోయితిని. అంతకుముందు నేను పంపిన శ్రీనాథుఁడు శృంగారియా అను పుస్తకమును దాశరథిగారిచే రివ్యూ చేయించి వారి యభిప్రాయమును ప్రభలో వారొక వ్యాసముగా ప్రకటించినారు. దాశరథిగారు నా పుస్తకమంతయు చూచి, నా దృష్టినిగుర్తించి నా రచనపై మంచిమాట వ్రాసినారు. రెండవ సంపుటమును గూర్చియు వారే వ్రాయవలెననుకొనినారు. అది జరుగదు నేమో యని శ్రీ శేషయ్యగారి నడుగఁ బోయితిని. వారు నామీఁద నెంతయో ఆదరము చూపించి, మీ రెడ్డిరాజుల చరిత్రము నేను చదివినాను. అది నవలవలె నున్నది. మీ రచనను నే నెంతయు అభినందించు చున్నాను, అని ప్రభలో ఈమధ్య శ్రీనాథునిపై గుంటూరు శేషేంద్రశర్మగారు వ్యాస మొకటి వ్రాసినారు. మీరు చూచినారా? అని యడిగిరి. చూచితి నంటిని. మీరేమియు వ్రాసి మా పత్రికకు పంపరా? అనినారు.

మీచేత ఆ మాట అనిపించుకొనియే ఆ పని చేయవలె ననుకొంటిని. శ్రీనాథుని విషయమున కేమిగాని, కాకతీయుల చరిత్రములో కొన్ని క్రొత్తవిషయములు చెప్పఁదలఁచినాను. వానిని ముందు పంపెదను. తరువాత శ్రీనాథుని విషయము వ్రాసెద నంటిని. వారు సరే యనిరి. మఱి భాషావిషయము ? అనిరి. వ్యావహారికమునకు సన్నిహితమైన సులభమైన గ్రాంథికములో వ్రాసెదనంటిని. ఆ వెంటనే 'ఓరుగల్లు కోటలో స్వయంభూ దేవుఁడు' అను వ్యాసము వ్రాసిపంపితిని. అది తొలివ్యాసముగా ఆంధ్రప్రభలో ప్రకటితమైనది. దినపత్రికలకు నా వ్యాసమును పంపుట అదియే మొదలు.

అప్పుడు మొదలుగ నిప్పటివఱకు కాకతీయ చరిత్రమునకు సంబంధించిన విషయములను గూర్చిన వ్యాసములన్నియు ఆంధ్రప్రభ ఆదివారము సంచికలలో పడుచునే యున్నవి. నడుమ రెండుమూఁడు వ్యాసములు శ్రీనాథుని కృతులకు సంబంధించినవికూడ ప్రకటితము లయినవి. నడుమలో పంచారామములు పరమ శివక్షేత్రములే యను వ్యాసమును ప్రకటించితిని. నా రచనలో సాధారణముగ నేవిషయమును గూర్చి రచన సాగించినను, ఆ యా స్థల విశేషములను ప్రత్యక్షముగఁ బోయి చూచి యచటఁ గానవచ్చిన విశేషమునకు నా యూహను జోడించి వ్రాయుటయే పరిపాటి. క్రొత్త విషయమును తెలుపఁ దలఁచినపుడుగాని కలమెత్తు నలవాటుకూడ లేదు. నేను ప్రత్యక్షముగఁ జూచి సత్యమని నాకు దోఁచిన విషయమును గూర్చియే నా ప్రస్తావముండును. విషయ విమర్శనము చేయుటయేగాని వ్యక్తివిమర్శనము చేయుటయు నాక నభిమతము.

—: ఇ త ర ర చ న లు :—

కాకతీయ చరిత్రమును గూర్చి వ్రాయ మొదలుపెట్టి నప్పటినుండియు నా దృష్టి కేవలము శ్రీనాథుని రచనలను గూర్చియే వ్రాయుట మాని యితర విషయములను గూర్చియు వ్రాయుట తటస్థించినది. సరస్వతీ పవరు ప్రెస్సు వారిచే భీమేశ్వర పురాణము నచ్చొత్తించుటకు ప్రధాన కారణము అంతకు ముందు 20 యేండ్లుగా ఆ పుస్తకమును మఱి యెవరును ముద్రింపకుండుట, పాఠకుల కా గ్రంథము దుర్లభమై యుండుటయే. ఆ వెనుక నొక యేడాది గడచిన తరువాత శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు సరస్వతీ ప్రెస్సువారితో వ్యావహారిక ప్రయోజనము సిద్ధింపనినాఁడు అచ్చుతప్పులనుకూడ నేను జేసిన పాఠపరిష్కారముగా నిరూపించుచు స్రవంతి పత్రికలో విమర్శించినారు. వారికి సమాధానము చెప్పుట వ్యక్తి విమర్శనముగా పరిణమించునని యెంచి విరమించితిని. తరువాత కొంత కాలమునకు వెంకట్రామ అండ్ కో వారిచే లఘుటీకతో కాళహస్సి మహాత్మ్యమును ప్రకటింపఁ జేసితిని. వారితోను వ్యావహారిక ప్రయోజనము సిద్ధింపక, కాళహస్తి మహాత్మ్య ముద్రణము ససిగా లేదని పిచ్చయ్య శాస్త్రిగారు విమర్శింప మొదలుపెట్టిరి. న్యాయదృష్టిలేక స్వార్థసాధనమునకై వ్రాసెడి వ్రాఁతలకు బదులు చెప్పుటవలన మనఃక్లేశమే తప్ప మఱియొక ప్రయోజన ముండదని, జగడమాడుటగా పరిణమింపక తప్పదని యెంచియే, కొర్లపాటి శ్రీరామమూర్తిగారు ఆంధ్ర ప్రభలో వ్రాసిన వ్రాఁతలకును బదులు చెప్పలేదు. చెప్పఁదలఁచు కొనుటయు లేదు.

కాళహస్తి మాహాత్మ్యమును ఏలూరులో ఆవిష్కరణము గౌ॥ డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతను జరిగినది. ఆతరువాత వెంకట్రామ అండుకో వారిచే తాత్పర్యముతో శ్రీమద్రామాయణము - సుందరకాండమును పీఠికతో సహా ప్రకటింపఁ జేసితిని. పిమ్మట సాహితిలో వాల్మీకి రామాయణముమీఁద వ్యాసములు వ్రాసి కొన్ని ప్రకటించియుంటిని. ఇట్లుండఁగ నీమధ్యలో అనకాపల్లి కళాశాలలో కవిసమ్మేళనమున పాల్గొనుటకు బోయినప్పుడు బొజ్జన్నకొండమీఁది బౌద్ధ శిథిలములు చూచుట తటస్థించినది. ఆ చూపుచే నేను మఱికొన్ని స్థలములలోని స్తూపములను చూడవలసివచ్చినది. దాని పర్యవసాన మిఁకమీఁద బౌద్ధ పరిశోధనలమీఁద కొన్ని క్రొత్త విషయములను ఆంధ్రలోకమున కందీయవలసి వచ్చుచున్నది. పరమేశ్వరు డెంతవఱకు కొనసాగించునో యంతవఱకు రచన కొనసాగించెదను. సహృదయులు సహకరించిన వానిని పుస్తకరూపములోనికిఁ దేఁగలను. అది అంతయు విధివిలాసమును బట్టి సాగును. శ్రీనాథుని రచనవలె నా రచన కూడ ఈశ్వరార్చన కళాశీలమై వెలయుగాత మని నా యాకాంక్ష.

శుభం భూయాత్.





శ్రీ పురిపండా అప్పలస్వామిగారు

# శ్రీ పురిపండా అప్పలస్వామి

శ్రీ అప్పలస్వామిగారు క్రోధినామ సంవత్సరం కార్తీక శుక్ల పంచమి శనివారం 13-11-1904 విశాఖపట్నం (ఇప్పుడు శ్రీకాకుళం) జిల్లా సాలూరులో జన్మించారు. తండ్రి వేంకట స్వామిగారు. తల్లి జయమ్మాంబ. వీరి అక్షరాభ్యాసం ఇచ్ఛాపురంలో జరిగింది. అనంతరం సాలూరు కొట్టక్కి కూర్మన్నగారి బడిలో ప్రవేశించారు. చదువునాట ఎలావుండినా ఆ దినాల్లో కూర్మన్నగారి బడి దండనలో యమ మందిరంలా వుండేది. కోదండ మెక్కించడం, గోడకుర్చీలు వెయ్యడం, పేముబెత్తాలతో బాదడం - దారుణంగా వుండేది. అప్పలస్వామిగారి బాల్యహృదయం దద్దరిల్లిపోయేది. ప్రతిదినం జ్వరంతో ఇంటికి వచ్చేవారు. అంచేత తల్లిదండ్రులు ఆ బడి మానిపించి, ఇంటికి కొంచెం దూరమైనా పుల్లాభట్ల వేంకటేశంగారి బడిలో ప్రవేశ పెట్టారు. కొన్నాళ్ళయ్యాక కూర్మన్నగారి కుమాళ్ళు సోమన్న గారు పెదకోమటి పేటలో పెట్టిన ఇంగ్లీషుబడిలో ప్రవేశ పెట్టారు. అప్పలస్వామిగారు అన్ని తరగతులలోనూ మొదటి శ్రేణిలో ఉత్తీర్ణులవుతూ, స్కూలు మానేటరుగా వుంటూ వచ్చారు. తరువాత రివరెండు డా. ఎస్. వి. సి. షూల్జ్ దొర గారి జర్మను మిషను స్కూలులో చేరారు.

—: పుట్టుక ము :—

అప్పలస్వామిగారికి అతి బాల్యంనుంచి తెలుగులో మంచి తెలివితేట లుండేవి. పదేళ్ళ వయస్సులోనే ఏ ప్రయత్నమూ లేకుండా అల్లిబిల్లిగా కవిత్వం అల్లడం ఆరంభించారు.

తాను వల్లించిన పద్యాల వరస ననుసరించి ఇష్టం వచ్చినట్టు పద్యం కట్టేవారు. ఒకచరణం పొట్టిగా పెట్టి, రెండోది పొడుగ్గా రాసి కందం అనేవారు. అర్థమైనా కాకపోయినా చేతికి దొరికిన తెలుగు పుస్తకమల్లా చదివేవారు. అదంతా తండ్రి గారికి ఇష్టంగా వుండేది కాదు. కాని వారి స్నేహితులుమాత్రం కుర్రాడిలో పుట్టుకవి లక్షణాలున్నాయనీ, వారించవద్దనీ చెప్పే వారు. కర్రి ధర్మయ్యగారని వొకాయన తండ్రిగారికి తెలియకుండా అప్పలస్వామిగారిని చేరబిలిచి సులక్షణసారం నేర్పారు. అనంతరం కవిజనాశ్రయమూ, కావ్యాలూ చదవమని ప్రోత్స హించారు. అప్పటినుంచి గణబద్ధమైన కవిత్వం కట్టడం అలవరుచుకున్నారు అప్పలస్వామిగారు. అలాగే స్వంత కృషితోనే హిందీ, బాంగ్లా, ఒడియా, ఇంగ్లీషు, సంస్కృతాలలో ప్రవేశం సంపాదించారు. ఉర్దూలో కూడా కొంత కృషి చేశారు. హిందీ పరీక్షలకు ఒడిశా కేంద్రంలో కట్టి రాష్ట్రమంతటికీ మొదటివానిగా ఉత్తీర్ణులయారు. పద్నాలుగు పదిహేనేళ్ళ ప్రాయంలోనే పత్రికలకు పద్యాలూ, వ్యాసాలూ పంపుతూ వచ్చారు. తొలి రచనలు త్రిలింగ, ఆంధ్ర పత్రిక, జ్యోతి (బరంపురం) మొదలైన పత్రికలలో వెలువడ్డాయి. వీరి తొలి గ్రంథం 'రాట్నపతాకం' 1921 లో వెలువడింది. తరవాత తమ ఇరవయ్యోయేట అడిదము సూరకవి ప్రణీతమైన 'కవి సంశయ విచ్ఛేదము' పరిష్కరించి ప్రకటించారు.

## —: దే శా రా ధ న :—

అది 1921 సంవత్సరం. గాంధీమహాత్ముడి అసహాయోద్యమంతో దేశం అట్టుడికినట్టు వుడికిపోతూ వుంది. యాత్రకి

వెళ్ళి ఆవాళ పూరీలో వున్నారు అప్పలస్వామిగారు. అప్పటికి పంట్లామూ, డ్రేసిస్సూ, టై, లో - దొరవేషం తప్ప పంచ కట్టడమైనా తెలియదు వారికి. వీధిలో వుషారుగా నడిచి పోతున్న వీరిని చూసి ఒక కాంగ్రెసు ప్రచారకుడు "భాయీ, ఇంకా ఈ వేషం వొదిలిపెట్టరా?" అన్నాడు. అది అర్థం కాలేదు అప్పలస్వామిగారికి. ఆ సాయంకాలం జగన్నాథవల్లభ మఠానికి ఎదురుగా పెద్ద సభ జరిగింది. ఉత్కలమణి గోపబంధు దాసు ఉపన్యసించాక, విదేశవస్త్రాలు తగలబెట్టారు. అందంతా చూసి అప్పలస్వామిగారి యువక రక్తంలో సంచలనం కలిగింది. స్వగ్రామానికి తిరిగివస్తూ విజయనగరంలో దిగేసరికి ఆవాళ విశాఖపట్నంలో నిర్బంధించిన మహమ్మదాలీగారిని రైల్లో తీసుకువెళుతున్నారని జనం రైలుస్టేషనుకి ఎగబడుతున్నారు. అప్పలస్వామిగారూ వెళ్ళారు. జనం చేసిన నినాదాలు ఆయన హృదయంలో ఉప్పెన లేవదీశాయి. ఆసాయంకాలం పార్కులో బ్రహ్మాండమైన సభ జరిగింది. బరంపురం ఆంధ్రమహాసభకు వెళుతున్న నాయకులు ఇటికాల సూర్యనారాయణ, గంపల గూడెం కుమార రాజా, ఉన్నవ లక్ష్మీబాయమ్మ మొదలైన వారు ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలు చేశారు. అవి విని ఆనాడే దేశారాధనకు దీక్ష పూనారు అప్పలస్వామిగారు. ఆనాడే విదేశ వస్త్రాలు విడిచిపెట్టారు; ఖద్దరు ధరించారు; గాంధీటోపీ తలమీద పెట్టుకున్నారు. కాంగ్రెసులో చేరారు. ప్రగతి భావాలతో దేశసేవకు నడుము కట్టారు. గజపతినగరం, బొబ్బిలి, సాలూరు, పార్వతీపురం తాలూకాలలో పల్లెపల్లె తిరిగి కాంగ్రెసు ప్రచారం చేశారు. ఎన్నో సభలలో ఉపన్యా

పాలుచేసి, ప్రజానీకంలో దేశభక్తి రేకెత్తించారు.

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా ఏర్పడ్డాక దేశమంతటా అన్ని తాలూకాలలోనూ వేతనంమీద కాంగ్రెసు ప్రచారకుల్ని నియమించారు. అప్పుడు అప్పలస్వామి గారిని సాలూరు తాలూకా కాంగ్రెసు ప్రచారకుడిగా నియమించారు. మల్లావఝ్ఝుల వేంకట రామమూర్తి, మంత్రాల లక్ష్మీనరసింహం, వారి సతీమణి రామసీతమ్మ మొదలైనవారితో కలిసి సాలూరు బొబ్బిలి, పార్వతీపురం తాలూకాలలో అసహాయోద్యమ ప్రచారం చేశారు అప్పలస్వామిగారు. ఎన్నో చోట్ల కాంగ్రెసు సంఘాలు స్థాపించారు. ఎన్నో దేశభక్తి గీతాలురాసి ప్రజలలో ఉద్బోధం కలిగించారు.

1925 సంవత్సరం విశాఖలో కర్రా సీతారామయ్య గారు జాతీయ వారపత్రిక 'స్వశక్తి' స్థాపించారు. దానికి సహాయ సంపాదకులుగానూ, మేనేజరుగాను వెళ్ళారు అప్పల స్వామిగారు. అవాళనుంచీ విశాఖపట్నంలోనే స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. విశాఖ వారి కార్యక్షేత్ర మయింది.

విశాఖలో మారేపల్లి రామచంద్రశాస్త్రి, వసంతరావు బుచ్చి సుందరరావు, మల్లిమడుగుల కోదండ రామస్వామి, తెన్నేటి విశ్వనాథం, కొల్లూరు సూర్యనారాయణగుప్త, దిగుమర్తి వేంకట రామస్వామి, వి. జి. గుప్త మొదలైన ప్రముఖులతో వీరికి సన్నిహిత మేర్పడింది. వారితో కలిసి కాంగ్రెసు ఉద్యమంలో పనిచేస్తూ వచ్చారు. ఖద్దరు, హరిజనోద్యమాలలో తీవ్రంగా పాల్గొన్నారు. ఎప్పటికప్పుడు కాంగ్రెసు ఆదేశాలు

పాలిస్తూ దేశారాధన చేశారు. మద్రాసు, కలకత్తా మొదలైన అఖిల భారత కాంగ్రెసు మహాసభలకు ప్రతినిధిగా వెళుతూ వచ్చారు. ఈ విధంగా విశాఖజిల్లా అంతటా వీరికి పరిచయ మేర్పడింది.

ఆ దినాల్లో విశాఖజిల్లా అంతటికీ ఏకైక ఖద్దరు సంస్థ విశాఖపట్నంలోని అఖిల భారత చరఖా సంఘం ఖాదీ భండారం. దాని మేనేజరుగా వుండిన మల్లిమడుగుల కోదండరామస్వామి ఎం. ఏ. గారు ఖాదీ ఇన్‌స్పెక్టరుగా నియమితులైనందువల్ల వారి స్థానే అప్పలస్వామిగారిని మేనేజరుగా నియమించారు. 1926 నుంచి ఒక పుష్కరంపాటు ఆ సంస్థ మేనేజరుగా వున్నారు అప్పలస్వామిగారు. ఆ సంస్థ అభివృద్ధికి అన్నివిధాల పాటుపడ్డారు.

విశాఖజిల్లా కాంగ్రెసు కార్యకలాపాలూ, సమావేశాలూ తరుచు అప్పలస్వామిగారి ఆఫీసులోనే జరిగేవి. అందుకనే 9-3-32లో వీరిమీద ప్రభుత్వం 144 ప్రయోగించింది. అనంతరం ఖాదీభాండారం అన్‌లాఫుల్ అసంబ్లీగా ప్రకటించి, జప్తుచేసింది. భాండారంవద్ద లాఠీచార్జి జరిపింది.

144 ఉల్లంఘించడానికి చరఖా సంఘం ఆంధ్రశాఖ కార్యదర్శి డా. పట్టాభి సీతారామయ్యగారిని అనుమతి కోరారు అప్పలస్వామిగారు. అయితే ఖాదీసంస్థ క్షేమంకోరి శ్రీ పట్టాభిగారు అప్పలస్వామిగారిని శాసనోల్లంఘనం చెయ్యడానికి అనుమతించలేదు. "మీరు పెంచిన బిడ్డ ఖాదీసంస్థ. దానిని హత్యచేసి, మీరు జైలుకి వెళ్ళదలచుకుంటే మీ చేతులతోనే తలుపులు తాళంవేసి వెళ్ళండి. వద్దు, మీరు జైలుకు

వెళ్ళవద్దు. మీరు బయటవుండే చెయ్యవలసిన పని ఎంతైనా వుంది. మీరు జైలుకు వెళ్ళినట్టుగానే కాంగ్రెసు గుర్తిస్తుంది" అని వ్రాశారు. ఈ కారణంచేతనే అప్పలస్వామిగారు రాజకీయ బాధితుల జాబితాలో చేరడమూ, వారికి కాంగ్రెసు ప్రభుత్వం పోతిన మల్లయ్యపాలెంలో పది ఎకరాల మెగక భూమి ప్రసాదించడమూ జరిగాయి.

## —: మున్సిపలు కౌన్సిలరు :—

1947 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం అప్పలస్వామిగారిని విశాఖపట్నం మున్సిపాల్టీకి అభ్యర్థిగా నిలబెట్టారు. శివాలయం 19 వార్డుకి నిలబడి అప్పలస్వామిగారు పోటీలేకుండా ఎన్నుకోబడ్డారు. అయిదేళ్ళు కౌన్సిలరుగా వుండి పట్టణాభివృద్ధికి పాటుపడ్డారు. వీరు కౌన్సిలరుగా వున్న కాలంలో తెన్నేటి విశ్వనాథంగారు కొంతకాలమూ, అంకితం వెంకట భానోజీరావుగారు కొంతకాలమూ చైర్మెను పదవిలో వున్నారు.

## —: జర్నలిస్టు :—

జర్నలిస్టుగా అప్పలస్వామిగారు మంచి అనుభవం గడించారు. స్వయంగా ఆయన 'స్వశక్తి' పత్రిక నడపడమే కాకుండా ఒకటిన్నర పుష్కరాలకు పైగా ఆంధ్రపత్రిక స్వకీయ విలేఖరిగా శంభుప్రసాదుగారి హయాం వచ్చేవరకు పనిచేశారు. వీరిని ప్రశంసిస్తూ దేశోద్ధారక నాగేశ్వరరావుగారు ఎన్నో వుత్తరాలు వ్రాశారు. ఆంధ్రపత్రికకే కాక తదితర పత్రికలకున్నూ ఆయన వ్యాసాలూ, వార్తలూ వ్రాసేవారు. అనకాపల్లిలో గ్రంథి వేంకటరమణయ్య బాబుగారు స్థాపించిన

'సత్యవాణి' పత్రికకు సంపాదకీయాలు వ్రాసేవారు. అవి ఆంధ్ర పత్రిక, కృష్ణాపత్రిక మొదలైనవాటిలో పునర్ముద్రణ జరిగేవి. అనేకుల మన్నన లందుకున్న కవితాసమితి వారి 'వైశాఖి' వారి చేతి చలవ. దేశంలోని అనేక పత్రికలకు వీరి చేదోడూ వాదోడూ వుండేవి. అమూల్యమైన వ్యాసాలతో సర్వాంగ సుందరంగా తమ "సమదర్శిని" 1929-1930 ఉగాది సంచిక వెలువడడానికి అప్పలస్వామిగారి సహాయమే కారణమని దాని సంపాదకులు తమ ప్రస్తావనలో తెలియచేశారు.

—: గ్రంథాలయ సేవ :—

మొదటినుంచి గ్రంథాలయోద్యమంలో ప్రముఖపాత్ర వహించారు అప్పలస్వామిగారు. గజపతినగరం తాలూకా మరడాంలో తమ స్వంత కామేశ్వరీ గ్రంథపేటిక స్థాపించారు. సాలూరు తాలూకా శివరాంపురం శ్రీరామ గ్రంథాలయం కోసమూ, పార్వతీపురం హైమవతీ గ్రంథాలయం కోసమూ ఎంతో కృషి చేశారు. మంతెన ఆదినారాయణమూర్తిగారు స్థాపించిన ఆంధ్రదేశ ప్రథమ గ్రంథాలయానికీ, కవితాసమితి గ్రంథాలయానికీ కొన్నాళ్ళు సంరక్షకులుగా వున్నారు. విశాఖ పట్నంలో జరిగిన పద్నాలుగో కళింగదేశ గ్రంథాలయ మహా సభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా వున్నారు. కొన్నాళ్ళు విశాఖజిల్లా గ్రంథాలయ సంఘాధ్యక్షులుగా వున్నారు. ఒడిశా నయాగడ రాజ్యంలోని సరస్వతీ గ్రంథాలయ సప్తమ వార్షికోత్సవానికి అధ్యక్షత వహించారు. 1948 లో విశాఖ మున్సిపలు సంఘంనుంచి D. L. A. సభ్యులుగా ఎన్నిక అయ్యారు. ఇంకోమారు విశాఖ D. L. A. కి సభ్యులుగా ప్రభుత్వంవారిచే

నామినేటు చేయబడ్డారు. 1963 లో ఆంధ్రప్రదేశ్ స్టేటులైబ్రరీ కమిటీ సభ్యులుగా ఏర్పడ్డారు. 28-4-53 లో అనకాల్లి శారదా గ్రంథాలయమూ, గౌరీ గ్రంథాలయమూ, లక్ష్మీగ్రంథాలయమూ, 1958 జనవరిలో విజయవాడ ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమూ అప్పలస్వామిగారిని సమ్మానించాయి.

—: సా హి త్య సే వ :—

ఆబాల్యంనుంచీ సాహిత్య సమారాధకులు అప్పలస్వామిగారు. ఎక్కడవుండినా, ఎలావుండినా సాహిత్యమే ఆయన జీవనం. వీరు 'స్వశక్తి' పత్రిక నడుపుతూ వున్నప్పుడే జిల్లాలోని దేశంలోని ఎంతోమంది కవులతోనూ, పండితులతోనూ వారికి స్నేహమూ, పరిచయమూ కుదిరాయి. వారి బసలో తరుచు కవులసమ్మేళనాలూ, పండితసమావేశాలూ జరుగుతూ వుండేవి. వాటి ఫలితమే కవితా సమితి స్థాపన.

అప్పలస్వామిగారు "స్వశక్తి"కార్యాలయంలో వుండగా ఒకనాడు ఒక తగుమనిషి పదిహేనేళ్ళ కుర్రాణ్ణి వెంటవేసుకు వచ్చి, 'అయ్యా, ఇతడు పద్యాలు వ్రాశాడు. మీ పత్రికలో వేయించండి' అన్నాడు. కుర్రాడు పలచగా, కొంచెం పొడవుగా వున్నాడు. విశాలమైన నుదురు, నుదుటిమీద పెద్దమచ్చ మెళ్ళో బంగారం గొలుసుతాడూ, వొదులుచొక్కా, పరాయీ ఆకర్షణీయంగా వున్నాడు. చేతిలోని పద్యాలు అందిచ్చాడు. 'దివ్యలోచనములు' అన్న శీర్షికతో గీతమాలిక అది. కింద శ్రీరంగం శ్రీనివాసరావు అని వుంది.

అప్పటికి ఆ వారం మేటరు ప్రెస్సుకి వెళ్ళిపోయింది కాకినాడ. అయినా అందులో కొంత మేటరు తీసివేసి "దివ్య

లోచనములు" ఆ వారపు పేపరులోనే ప్రకటించారు అప్పల స్వామిగారు. తొలి కలయికలోనే శ్రీ శ్రీ ప్రతిభ గమనించా రాయన. అవాళనుంచీ శ్రీ శ్రీ పురిపండా అరమరిక లేని స్నేహితు లయారు. కలిసి కవితా వ్యాసంగం చేశారు. వీరి ఈ కలయిక నవ్యసాహిత్యంలో కొత్తరేకు విరియడానికి కారణమైంది. శ్రీ శ్రీని తమ్ముడూ అని పిలిచేవారు అప్పలస్వామిగారు.

అప్పలస్వామిగారూ, శ్రీశ్రీగారూ, వడ్డాది సీతారా మాంజనేయులుగారూ - ముగ్గురూ కలిసి ఒకనాడు ఆలోచిం చారు. 6-5-1926 తేదీని కవితా సమితి స్థాపించారు. జిల్లా లోని ప్రసిద్ధ రచయితలను ఈ సమితిలో సభ్యులుగా చేర్చారు. ప్రథమ సమావేశం రామచంద్ర కవిగారి ధర్మాశ్రమంలో జరిగింది. ఆ సమావేశంలో మారేపల్లి రామచంద్రశాస్త్రి గారిని అధ్యక్షులుగానూ, అప్పలస్వామిగారిని కార్యదర్శిగానూ ఎన్నుకున్నారు. భమిడిపాటి చిన యజ్ఞనారాయణ శర్మగారిని ఉపాధ్యక్షులుగానూ, సబ్నవీసు సత్య కేశవరావుగారిని కోశాధి పతిగానూ ఎన్నుకున్నారు.

కవితా సమితి గురించి 1947 లో శ్రీశ్రీ ఒకచోట ఇలా వ్రాశారు. "పురిపండా, వడ్డాది సీతారామాంజనేయులూ నేనూ కలిసి ఒకరోజు కవితా సమితి స్థాపించాం. పురిపండా దానికి అఖిలాంధ్రఖ్యాతి తీసుకొచ్చాడు. అతని సంఘటనశక్తి అమోఘం. కవితా సమితి తొలినుంచీ అతని భుజస్కంధాల మీదనే సాగింది." (ఆంధ్ర శిల్పి. 1947, ఫిబ్రవరి.) ఈ సమితిలో గ్రాంథికవాదులూ, వ్యావహారికవాదులూ, సనాత నులూ, నవ్యులూ, అతినవ్యులూ - అన్ని పంథాలవాదూ

సభ్యులుగా వున్నారు. ఇందరూ, ఇన్ని రకాలవారు సామరస్యంతో సమితిలో ఒక్క త్రాటిమీద నడుచుకున్నారంటే దానికి కారణం అప్పలస్వామిగారు. వీరు అతి నవ్యులకోవకు చెందినవారే అయినా పురాతనులలో పురాతనులుగానూ, నవ్యులలో నవ్యులుగానూ మసలగలిగారు. అందుకనే నవ్యులూ పురాతనులూ వీరిని గౌరవిస్తూ వచ్చారు.

కవితా సమితి ఇప్పటికి పాతికపైగా గ్రంథాలు ప్రకటించింది. వైశాఖ సంచికలు వెలువరించింది. ఎన్నో సభలు చేసింది. వార్షికోత్సవాలు జరుపుకుంది. ఎందరినో సన్మానించింది. ఎంతోమందికి జయంతులు జరిపించి మారేపల్లి రామచంద్రకవిగారి షష్టిపూర్తి ఘనంగా జరిగించింది 1933లో ఆంధ్ర కవుల ఛాయాచిత్ర ప్రదర్శనం జరిపింది. ఆయేటి వార్షికోత్సవంలో అధ్యక్షత వహించి గిడుగు రామమూర్తిగారు చేసిన ఉపన్యాసమూ – ఛాయాచిత్ర ప్రదర్శనం తెరుస్తూ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు చేసిన ఉపన్యాసమూ చరిత్ర గుర్తింపదగినవి. 10-12-36 లో సమితి రవీంద్రనాథ ఠాకూరు గారి నాహ్వానించి సన్మానంచేసింది. దీనంతటికీ అప్పలస్వామి గారి కృషేకారణం. రామచంద్రకవిగారు 1951 లో స్వర్గస్థులయాక సమితి సమావేశమై అప్పలస్వామిగారిని అధ్యక్షులుగానూ, స్థానాపతి రుక్మిణమ్మగారినీ, అంగర సూర్యారావు గారిని కార్యదర్శులుగానూ, శ్రీశ్రీ గారిని ఉపాధ్యక్షులుగానూ ఎన్నుకుంది.

దేశంలో కవులూ, రచయితలూ యావన్మందీ తమ తమ రచనా పద్ధతులు ఎలా వుండినా – సంఘీభావంతో వుండి

సారస్వత సేవకు పూనుకున్నప్పుడే ఆంధ్రసాహిత్యానికి అభ్యుదయమని అప్పలస్వామిగారి నమ్మకం. ఆ నమ్మకంతోనే ఆయన 1928 లో సకలాంధ్ర కవి సమ్మేళనం తలపెట్టారు. అలాటి ప్రయత్నాలకు అదే ప్రథమం. సకలాంధ్ర కవిసమ్మేళనం 15-5-1928 తేదీని భీమునిపట్నంలో జరిగింది. నడకుదిటి వీర రాజుగారు ఆ సమావేశానికి అధ్యక్షులు. అప్పలస్వామిగారు కార్యదర్శి. గిడుగు రామమూర్తి, గిడుగు సీతాపతి, పానంది జగన్నాథస్వామి, తాతా రాయడుశాస్త్రి, బుర్రా శేషగిరి రావు, పర్లాఖిమిడి మహారాజు, శ్రీశ్రీ, ఓలేటి పార్వతీశము మొదలైన మహనీయు లెందరో ఆ సభలో పాల్గొన్నారు. అధ్యక్షులు తమ ముద్రిత ఉపన్యాసములో "ఇంతకాలమునకు మన దేశమున నిట్టి కవిసమ్మేళనము కలిగినది. ఇది యాంధ్ర దేశ పురోభివృద్ధికి శుభ సూచకము. ఏతత్కార్యభారము వహించి యెల్లవిధముల పాటుపడుచున్న కార్యదర్శి మహా రాజశ్రీ పురిపండా అప్పలస్వామిగారికి నా హృదయపూర్వకాభి వందనము లర్పించు చున్నాను" అన్నారు.

అప్పలస్వామిగారు సాహిత్యంలో ఆదినుంచీ క్రొత్త పోకడలే అనుసరించారు. క్రొత్తపోకడలనే దోహదం చేశారు. క్రొత్తపుంత తొక్కిన యువకుల్ని ప్రోత్సహించారు. తమవరకే నవ్యత అనకుండా, కాలం వికసించినకొద్దీ నవ్యత వికసిస్తూనే వుంటుందని వారి నమ్మిక. మొదట ప్రేమకవిత్వంతో సాహిత్యా రంగంలో అడుగుపెట్టి, కాలంతో కాలు ముందుకివేసి అధి వాస్తవిక, అభ్యుదయ మార్గాలుకూడా ఆకళించుకుని రచనలు చేశారు.

ఈసందర్భంలో నవ్యాంధ్ర సాహిత్యవీధులు ఇలా వ్రాసింది.

"పురిపండా క్రొత్త పద్ధతిని ఖండకావ్యాలు వ్రాస్తూ వచ్చి, ఈ కాలానికి బాగా స్థిరపడిన అధివాస్తవికతకు దారి తీసినవారిలో ఒకరనిపించుకున్నాడు. ఈయన కలములో ఒక దూకుడు కనిపిస్తుంది. హృదయాన్ని ఆవేశముతో తరిమి తన్నే ఆవేశ భాషాభావాలతో పురిపండా సాధించి, తర్వాత వచ్చిన గేయకవు లనేకులకు ప్రత్యక్షముగానూ, పరోక్షముగానూ మార్గదర్శకు డైనాడనవలె. ఈ విధముగా తా నా నవ్యుడు అవుతూ - అతి నవ్యుడు కాకుండా వుండలేకపోతూ ఉన్న పురిపండా ఉభయ మార్గాలకు వంతెన కట్టినవాళ్ళలో చేసు తున్నాడు."

అతి నవ్యులు అప్పలస్వామిగారిని అభ్యుదయ కవుల మూల పురుషులైన అయిదుగురిలో ఒకరుగా గుర్తించారు (నవత రెండో సంచిక).

వీరి విప్లవగేయం వినండి :

తొలినాటి సంద్రాలు
తుహినగిరి శిఖరాలు
ఇంకిపోతున్నాయిలే
క్రుంగిపోతున్నాయిలే.

తాత వేసిన వుంత
దైవమేలిన సంత
పల్లేరు పాకిందిలే
జిల్లేడు మొలిచిందిలే.

రాజు కట్టిన కోట
రాణి మెట్టిన తోట
భూతాలు గెంతాయిలే.
బూమికలే నిండాయిలే.

నల్లమందే కాని
కళ్ళిప్పనంటావు
రాతిగుళ్ళకె కాని
రాను పొమ్మంటావు
సుడిగాలి రేగిందిలే
పిడుగు గర్జించిందిలే.

నిని కవిసమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణగారు ఇలా వ్యాఖ్యానించారు :

"ఇది విప్లవ గీతం. తొలినాటి సంప్రదాయాలంటే సంప్రదాయాలు. తొలినాటి భావాలు. తుహినగిరి శిఖరాలంటే పూర్వపు ఔన్నత్యాలు. తాత వేసిన పుంతమీద పల్లేరు పాకుతున్నది, జిల్లేడు మొలుస్తున్నది అనగా సర్వ సంప్రదాయచ్ఛేదం జరుగుతున్నది. రాజు కట్టిన కోటలో భూతాలు గెంతాయి, బూమికలు నిండాయి అంటే రాజ్యాంగం మారిపోతున్నది. రాజులు పోతున్నారు. సామ్యవాదం వస్తున్నది."

అప్పలస్వామిగారు ఎన్నో సభలకు అధ్యక్షత వహించారు. ఎన్నో సభలలో ఉపన్యాసాలు చేశారు. ఎన్నో సభలలో కావ్యగానం చేశారు. మన విశ్వ విద్యాలయాలలో నాడుకభాష ప్రవేశపెట్టవలిసిన ఆవశ్యకతను ఎన్నో సమావేశా

లలో ఉద్యోగించారు. 15-4-'62 తేదీని రాజమహేంద్రవరంలో జరిగిన శతజయంత్యుత్సవ మహాసభకు అధ్యక్షత వహించారు. 1963 జూనులో పక్షం దినాలు హైదరాబాదులో జరిగిన అఖిలభారత రచయితల శిబిరానికి అధ్యక్షత వహించారు. ఈ సభలలో వారెంతటి కార్యదక్షత ప్రదర్శించినదీ, భారత దేశం నలుమూలలనుంచి విచ్చేసిన రచయితల స్నేహసౌహార్ద్రాలెంతగా చూరగొన్నదీ శిబిర కార్యదర్శి, గౌహతి (అస్సాం) నివాసులు ప్రొ. తారిణీచరణ భట్టాచార్య ఎం. ఏ., గారు అప్పలస్వామిగారికి వ్రాసిన ఈ వాక్యాలు చూడండి :

"You work not only the general Chairman, but also, by common consent, the most attractive person who always spoke from his heart. Your geniality has left lasting stamp on us and you can rest assured that all the participants will long cherish your gentlemanliness and warmth of feelings. Personally I found in you a generous elder brother. I deem it a proud honour for me that I could get the affection of a distinguished writer like you."

అప్పలస్వామిగారు కవితా సమితికే కాక ఇతర సంస్థలకు కూడా అధ్యక్షులుగా వున్నారు. కొన్నాళ్లు విశాఖ రచయితల సంఘానికి అధ్యక్షులుగా వున్నారు. ఆంధ్ర లలిత కళా సుజన రంజని మహాసభకు అధ్యక్షులుగా వున్నారు. ఒడిశాలో నయాగడ సదానంద సాహిత్య పరిషత్తుకు అధ్యక్షులుగా వున్నారు. ఎంతో కాలంనుంచి అఖిలభారత ఎ. ఇ. ఎస్ సంస్థలో సభ్యులుగా వున్నారు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ సాహిత్య

అకాడమీలోనూ, ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీలోనూ సభ్యులుగా వున్నారు.

## —: వ్యావహారిక వాది :—

1928 వరకు అప్పలస్వామిగారు గ్రాంధికంలోనే రచన సాగించారు. 15-5-1928 తేదీని భీమునిపట్నంలో జరిగిన సకలాంధ్ర కవి సమ్మేళనంలో గిడుగు రామమూర్తి పంతులు గారు అప్పలస్వామిగారిని ప్రబోధించడమూ, వారు వ్యావహారిక వాదిగా మారడమూ జరిగింది. నిజంగా అది చారిత్రాత్మక సన్నివేశం. సమావేశానికి వస్తూ, "పురిపండా అప్పలస్వామిగారు ఏరీ?" అని అడిగారు పంతులుగారు గట్టిగా. "మీమీద ఇవాళ పిడుగులు కురుస్తాయి" అన్నారు అప్పలస్వామిగారి పక్కనేవున్న భోగరాజు నారాయణమూర్తిగారు. "భయం లేదు" అంటూ లేచి, ఎదురువెళ్ళి పంతులుగారికి అభివందనం చేశారు అప్పలస్వామిగారు. "ఏమయ్యా, మీరు ముందుకి రావలిసిన యువకులు. గ్రాంధికంలో రాస్తున్నారు. మీ కవిసమ్మేళనం ఆహ్వానమున్నూ గ్రాంధికంలోనే వుంది. గ్రాంధికం కృత్రిమ భాష. అది ఎవరు వ్రాసినా తప్పులతడకే" అంటూ ఆవేదనతో ఉద్బోధించారు. అంతా విని "ఇవాళ నుంచీ నేను వ్యావహారికంలోనే వ్రాస్తాను. తమకు మాట ఇస్తున్నాను. ఆశీర్వదించండి" అంటూ నమస్కరించారు అప్పలస్వామిగారు. ఆనందభాష్పాలతో ఆలింగనం చేసుకున్నారు పంతులుగారు. ఆవాళనుంచే వ్యావహారిక భాషలో కలం నడిపించడానికి దీక్ష పూనారు అప్పలస్వామిగారు. ఆ దీక్షా

ఫలితమే వ్యావహారికాంధ్ర మహా భారత అవతరణకి కారణమైంది.

5-7-33 తేదీని రామమూర్తి పంతులుగారు అప్పల స్వామిగారికి ఒక వుత్తరం వ్రాశారు. అందులో "మీరు రచించిన 'గుడిలోని దైవమా' అన్న పాట చదివి చాలా సంతోషించాను. వచనరచన కూడా వ్యావహారిక భాషలో జరిగితేనేగాని, దేశభాష అన్ని పనులకూ అనుకూలముగా అందరికీ సామాన్యము కాదు అని మనవిచేస్తున్నాను" అని వ్రాశారు. ఇది కూడా అప్పలస్వామిగారిని మహా భారతం, రామాయణం, భాగవతం వంటి ఉద్గ్రంథాలు వ్యావహారిక భాషలో వ్రాయడానికి ప్రేరేపణ కలిగించింది.

## —: ఒక పద్యం :—

1935 ఫిబ్రవరి, మార్చి నెలలలో అప్పలస్వామిగారు విషమ జ్వరంతో బాధపడ్డారు. అప్పుడు వారి స్థితి ఎంతయినా ఆందోళన కలిగించింది. మిత్రు లెంతయినా కలవరపడ్డారు. మెలిపాకనుంచి ముద్దా విశ్వనాథంగారూ, ఎలమంచిలినుంచి మారేపల్లి రామచంద్రశాస్త్రిగారూ వచ్చి, వారింటనే వుండి వారి ఆరోగ్యంకోసం ఎంతయినా కృషి చేశారు. వైద్యసోదరులు మజ్జి రమణయ్య పాత్రుడు, సన్యాసయ్య పాత్రుడుగార్లు పగలనక, రాత్రనక వైద్యం చేశారు. ఈ స్థితిని సూచించే అప్పలస్వామిగారి పద్యం ఇక్కడ ఉదహరించదగింది :

స్వాప్నికచ్ఛాయ లటుల వాసరము లెన్నొ
గడచిపోయెను, జీవితాకాంక్ష వెలియు

తీరనే లేదు, తృషిత యాత్రికుడ నేను,
ఓయి వికటాట్టహాస మృత్యుగ్రమూర్తి !
అపుడె నిలిచితివేల నా ప్రాంగణాన ?

మృత్యువు తప్పింది. కాని, ఆ కాలంలోనే వారి స్నేహితులు భమిడిపాటి చిన యజ్ఞనారాయణశర్మ, సీతానాథ్ దేవు కాలం చెయ్యడం వారి నెంతయినా కుంగదీసింది.

—: వ్యవహర్త :—

1938 నుంచి సాలూరు రాజకుమారి కామిలీప్రసాదు సామంతుగారి ఒడిశాలోని ఎస్టేటు మేనేజు చెయ్యవలసిన బాధ్యత అప్పలస్వామిగారికి తటస్థించింది. తమ భర్త సీతానాథదేవూ, మామ గోపీనాథ జగదేవూ వరసగా 1935, 1938 సంవత్సరాలలో కాలం చెయ్యడమూ, కుమారుడు చిన్నవాడు కావడమూ కారణంగా సామంతుగారు అప్పలస్వామిగారి సహాయం అర్థించారు. వెనుక సాలూరులో వారి కుండిన అనుబంధం పురస్కరించుకుని అప్పలస్వామిగారు అంగీకరించి సామంతుగారికి సాయపడుతూ వచ్చారు. ఎస్టేటు ఎంతో అభివృద్ధికి తెచ్చారు. సామంతుగారి కుమారుడు ప్రయోజకుడయ్యాక, ఆస్తిలో సగం విక్రయించి, చెడుదారి తొక్కడంతో తల్లి కామిలీప్రసాదుగారు హిందూస్త్రీల సత్వ రక్షణ చట్టం ప్రకారం పూరీ, భువనేశ్వరం సబుజ్జి కోర్టులో దావా వేశారు. ఈ దావా ఆ ప్రాంతంలో పెద్ద సంచలనం కలిగించింది. ఇందులో అప్పలస్వామిగారు న్యాయపక్షమైన తల్లిగారిపక్షం వహించారు. కుమారుడు అసత్యమార్గం తొక్కినా

అప్పలస్వామిగారు సత్యమార్గాన్నే దావా నడిపించారు. అక్ర మాన్ని ఎదిరించడానికి ఎంతయినా పాటుపడ్డారు. కుమారుడు తల్లిగారిని అసురఢిప స్వగృహంలో యాతనలపాలు చెయ్య డానికి పూనుకోకుండా పక్కగ్రామం కరడా అగ్రహారంలో ఆమెకు అన్నివిధాలా భద్రత కలిగించారు. దావాలో అవసర మైన రికార్డూ, సాక్ష్యమూ సమకూర్చి తమ వ్యవహారజ్ఞానం ప్రదర్శించారు. సబుజడ్జికోర్టులో కామిలీప్రసాదుగారు పూర్తిగా విజయం పొందారు. అసురఢిప, కరడా గ్రామాలు పూరీ నయాగడ సబు డివిజనులోనివి. కామిలీప్రసాదుగారు సాలూరు రాజు కుమార్తె. ఈమె మామ గోపీనాథ జగదేవు గంజాం సాలూరురాజు తమ్ముడు. అత్తగారు నయాగడరాజు కుమార్తె చంద్రమౌళిజమ్మా సామంతు. దావాపడిన ఆస్తి జగదేవుగారి స్వార్జితం.

—: గ్రంథ రచన :—

అప్పలస్వామిగారు అతి బాల్యంనుంచీ గ్రంథ రచన చేసినా వారి తొలి గ్రంథం 'రాట్నపతాకం' 1923 లో వెలు వడింది. అంతకిముందు ఆయన 'ప్రమదా పరిణయము' అని గద్య పద్యాల గ్రంథ మొకటి వ్రాశారు. కాని బాల్యరచన కావడంచేత ప్రకటనయోగ్యం కాలేదు. రాట్నపతాకం చిన్న కందపద్యాల గ్రంథం. ఇందులో గాంధీమహాత్ముడి రాట్న సందేశం గానం చేశాడు కవి. అనంతరం అప్పలస్వామిగారి "మహమ్మదు చరిత్ర" 1927లో వెలువడింది. ఆనాటి ఖిలాఫత్ ఉద్యమం అనుసరించి హిందూ మహమ్మదీయ సమ్మేళనం

కోరుతూ వ్రాసిన చిన్న గ్రంథం ఇది. దీనిని పరామర్శిస్తూ 4-1-23 హిందూ పత్రిక ఇలా వ్రాసింది.

"This book narrats in simple Telugu, the life and teachings of Mohomed and is calculated to promote Hindu Muslim unity. It explains that the religion propounded by the Prophet is fundamentally the same as the Hindu religion.

1927 లో వారి "మురళీధ్వనీ", 1931 లో వారి "ఉత్కల పతనమూ" వెలువడ్డాయి. ఉత్కల పతనం రచన 1928 కి ముందే జరిగింది. కనుకనే అది ప్రౌఢమైన గ్రాంథికం లోనే వుంది. దీనికి ముందుమాట వ్రాయుచు శ్రీ మారేపల్లి రామచంద్ర కవిగారు ఇలా వ్రాశారు.

"అప్పలస్వామిగారు ఆంధ్ర పాఠకలోకమునకు క్రొత్త వారు కారు. తెలుగువారి అభినందనమునకు పాత్రులు. కవితా సమితి కార్యదర్శిగా ఉండి ఈయన చేయు భాషాసేవ ఎంతయు ప్రశంసనీయము. వీరి ఉత్కల పతనము రచన రసవంతమగు టచే నా మదిని రంజింపగలిగె."

మురళీధ్వనిని పరామర్శిస్తూ 1929-1930 సమదర్శిని ఉగాది సంచికలో సబ్బనీసు సత్యకేశవరావుగారు ఇలా వ్రాశారు.

"ఈ మురళీధ్వని యందలి భాష సరళముగ నున్నది. కవిత్వము చాలవరకు సలక్షణముగనే యున్నది. ధార యనర్గళము; భావము లుదారములై, నీతిదాయకములై, దేశభక్తి ప్రధానములై యలరారుచున్నవి. ఇందు సాంఘిక విషయముల

కంటె కవిత్వ స్వతంత్రత మెందు; కవిత్వ స్వతంత్రతకంటె దేశభక్తి యధికము; దేశభక్తికంటె ప్రేమ యత్యధికము. ప్రేమయే ఈ ఖండకావ్యమున ప్రధాన రసము. ఇది యాహ్లాద కరముగ నున్నది."

మురళీధ్వని ప్రకటన తరవాత అప్పలస్వామిగారి కవిత్వంలో ఎంతో మార్పు వచ్చింది. సరికొత్త పోకడల నాకళించుకుని గేయాలూ, ఖండకావ్యాలూ వ్రాశారు వారు. వాటి ఫలితమే సౌదామిని, పులిపంజా కావ్య సంపుటాలు. వీరి సౌదామిని కొన్ని పద్యాలూ, గేయాలూ శ్రీశ్రీ ఆంగ్లంలోకి అనువదించారు. దీని మొదటి ముద్రణ 1947 లోనూ, రెండో ముద్రణ 1951 లోనూ జరిగాయి.

సౌదామిని ఒడియాభాషలో కూడా భువనేశ్వరమిశ్ర ఎం. ఏ. గారు అనువదించారు.

"వచనరచన కూడా వ్యావహారిక భాషలో జరిగితేనే కాని, దేశభాష అన్నిపనులకూ అనుకూలముగా అందరికీ సామాన్యము కాదు" అన్న గిడుగు రామమూర్తిగారి ఉపదేశం అక్షరాలా నమ్మారు అప్పలస్వామిగారు. సామ్యవాద సిద్ధాంతం ప్రకారం తిండీ గుడ్డలతో పాటు మన విజ్ఞానం కూడా అందరికీ అందుబాటు కావాలంటే అది వ్యావహారిక భాషవల్లే సాధ్యపడుతుందనీ విశ్వసించారు. ఆ విశ్వాసంతోనే ఓం ప్రథమంగా 1851 లో కవిత్రయంవారి మహాభారతం వ్యావహారిక భాషలో వ్రాయడానికి బద్ధకంకణు లయారు. వారి మహత్సంకల్పం సఫలమైంది. వారు శ్రీకారం చుట్టిన ముహూర్తం శుభప్రదమైంది. వారు వ్యావహారిక భాషలో మహా భారతం

వ్రాస్తున్నాననడంతోనే దేశం స్వాగతం పలికింది. కృష్ణాపత్రికవంటి పత్రికలున్నూ "వీరు ఆంధ్రదేశానికి చేస్తున్న మహోపకారం అమూల్యమైనది" అని ప్రోత్సహించాయి. విరాళాలు సేకరించి సాయపడ్డారు ఆప్తమిత్రులు శ్రీ బిరుసుమంతి సింహాచలం, శ్రీ కొల్లూరు వీరభద్రరావు మొదలైనవారు. భారత రచన నిరాఘాటంగా సాగి పోయింది. దేశం నలుమూలలనుంచి అపూర్వమైన ఆమోదం లభించింది.

మొదట విరాటోద్యోగాల సంపుటం 1952 లో వెలువడింది. పుస్తకం బయటికి వచ్చిననాడే 5-12-52 తేదీని కళాభివర్ధనీ పరిషత్తువారు రాజమండ్రిలో వారిని సమ్మానించారు. పండితులకూ, కవులకు తేనీటివిందు చేశారు. 20-12-52 తేదీని విశాఖ రచయితల సంఘం యాజమాన్యం క్రింద విశాఖపట్టణం పౌరులు వారికి ఘనమైన సమ్మానం జరిపారు కాశ్మీరు శాలువా, నవరత్నాల ముద్రిక సమర్పించారు. 3,500 రూపాయలు నిధి బహూకరించారు. వివిధ సాహిత్య సంస్థలు సన్మానపత్రాలు సమర్పించారు. పలువురు కవులు పద్య పుష్పాలర్పించారు. 26-4-53 తేదీని అనకాపల్లి పౌరులున్నూ సన్మానించారు. తెన్నేటి విశ్వనాథంగారి అధ్యక్షతను సభ జరిపి 'మహాకవి' అని బిరుద మిచ్చారు.

భారత రచన నిరాఘాటంగా సాగిపోయింది. పద్దెనిమిది పర్వాలూ ఏడు సంపుటాల్లో వెలువడ్డాయి.

1954 లో అప్పలస్వామిగారి భగవద్గీత వాడుకభాషలో వెలువడింది. 10-10-54 తేదీని దీని ఆవిష్కరణ మహోత్సవం విశాఖలో ఘనంగా జరిగింది.

1957 లో వీరి వీరభారతం వెలువడింది. 1857 స్వాతంత్ర్యసమర చరిత్ర ఇది. గ్రంథం చదివి పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు వ్రాసిన లేఖ ఇక్కడ ఉదహరిస్తేచాలు గ్రంథ ప్రాశస్త్యం వెల్లడి అవుతుంది.

"మీ రచన (వీరభారతం) చాలా గొప్పగా వుంది. పది పన్నెండేళ్ళ ఈలోపున తెలుగులో యిలాంటి గ్రంథం రాలేదు. అంటే అదివరకు వచ్చిందని కాదు.

విషయం చాలా గొప్పది. మన రక్తంలో మిళితమైనది. మన జీవస్రవంతిలో ఒకప్పుడు ధారాళంగా ప్రవహించిన్నీ వుండినది. అదికాదు చెప్పడం. మీ రచన చాలా గొప్పగా వుంది. ఆ గొప్పతనం దానికి వాడుక భాషవల్ల చాలా హెచ్చింది. విషయానికి తగిన భాష. భాషకు తగిన శైలి.

నా నమ్మకం ఏమిటంటే ?

నేను జన్మపరంపరా సిద్ధాంతం నమ్మేవాణ్ణి.

దాన్నిబట్టి నా భావన ఏమంటే ?

మీరు ఆ (1857) విప్లవం కళ్లారా చూశారు. ఇంగ్లీషువాళ్ళ ఆ రాక్షసత్వం మీకు అస్థిగతం అయిపోయింది. ఇంతే కాదు. ఆ విప్లవంలో మీరు పాలు పుచ్చుకున్నారు. ఇటు దేశీయులను ప్రబోధిస్తూ అటు శత్రువులను కుప్పతెప్పలుగా కూల్చిన్నీ వేశారు. అప్పుడు మీరు కత్తి విసిరి అంతపనీ చేసే వుండకపోతే, కలంపట్టి ఇప్పుడింత హృదయం స్పందించేటట్లు మీరు రాయగలిగి వుండేవారుకారు. రక్తం ఇంత వుడుకెత్తేటట్టున్నా మీరు రాయగలిగి వుండరు.

మరి, నా బాధ ఏమిటంటే,

వెర్రి వెల్నాటిన్నేను.

యుద్ధం చేసి వుండన్నేను. ఆ విప్లవం చూడన్నైనా చూశానో లేదో? అసలు ఆ సమయాన నేనున్నానో లేనో కూడా?

కాని, మీ రచన చదవగా నాకున్నూ అది ఆత్మాను భవం అన్నట్టనిపించింది.

మీ జీవితం మిక్కిలీ ధన్యం.

మీ మహాభారతం నేను కాదనను, కాని మీకు శాశ్వతస్థితి కలిగించేది వీరభారతం. జాతీయ నిర్మాతల్లో మీ రౌకరని ముందు ముందు (పరశ్రేయస్సుహానం ఎరగని ఇప్పటి తరం కాదు) జాతి అంతా గుర్తించి మిమ్మ ఆరాధిస్తుంది.

మీరు నాకు ఆత్మీయులు.

ఇందుకు నేను గర్విస్తున్నాను."

1959 లో అప్పలస్వామిగారి రామాయణం ఏడు కాండలూ వెలువడ్డాయి.

1962 లో వీరి భాగవతం మూడు సంపుటాల్లో వెలువడింది.

మహాభారతం, రామాయణం, భాగవతం వాడుక భాషలో వ్రాసి ఆంధ్ర ప్రజానీకానికి శాశ్వతమైన మహోపకారం చేశారు అప్పలస్వామిగారు. వారి జీవితమున్నూ సార్థకం చేసుకున్నారు.

మహాభారత ఆవిష్కరణ సమయంలో అప్పటి మధ్య ప్రదేశ గవర్నరు డా. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఇలా వ్రాశారు:

"శ్రీ పురిపండా అప్పలస్వామిగారు నాకు చిరకాల పరిచితులే కాక ప్రియమిత్రులని కూడా చెప్ప సాహసించుచున్నాను. మహాభారతము వ్యావహారిక భాషలో వ్రాయుట సాహసమగు యత్నము. వ్యావహారిక భాషను వృద్ధిచేయుటకు గ్రంథ రచనయే తగు సహాకారము నొసంగ గలదు. వాదోపవాదములు కంఠశోషకు కారణములు. వీనిని అతిక్రమించి, శ్రీ అప్పలస్వామిగారు గ్రంథ రచనకు పూనుకొనుట శ్లాఘనీయము. వీరికి చేయు సత్కార సమయమున నా యభినందనములు ఇందుమూలముగా నంపుచున్నాను.

భో. పట్టాభి సీతారామయ్య
10-12-52"

పై గ్రంథాలు కాక అప్పలస్వామిగారు వ్యాసావళి (అముద్రితం), సౌదామిని (అము), పులిపంజా (అము) జగద్గురు శంకరాచార్య (1957), భోమాణ ఆతగుంత (1956) విశ్వకథావీధి (ఆరు భా), పిల్లల కథాసాగరం (1957), సంగ్రహ మహాభారతం (అము), ముందడుగు (అము), అభిజ్ఞాన శాకుంతలం (అము), వాత్స్యాయనీయం (అము), హంగేరీ విప్లవం (1960), మట్టిమనుషులు (1958), అమృతసంతానం (1963)

దేవీ భాగవతం (అము) మొదలైనవి అరవై గ్రంథాలకు పైగా వ్రాశారు. హిందీ, ఇంగ్లీషు, సంస్కృతం, ఒడియా, బాంగ్లా భాషలనుంచి ఎన్నో అనువాదాలు చేశారు. బాంగ్లా సాహిత్య చరిత్ర వ్రాశారు. ఒడియా స్త్రీ రచయితల చరిత్ర వ్రాశారు. వివిధసాహిత్యాలమీద ఎన్నో వ్యాసాలు వ్రాశారు. ఒడియాలో ఆంధ్ర సాహిత్య చరిత్ర వ్రాశారు. అఖిల భారత సాహిత్య అకాడమీవారి నిర్దేశంతో ఒడియానుంచి "మట్టి మనుషులు", "అమృత సంతానం" నవలలు తెలుగు చేశారు. ఈ అనువాదాలు మనపత్రికలన్నీ ముక్తకంఠంతో ప్రశంసించాయి. అమృత సంతానం పరిచయం చేస్తూ 12-1-64 ఆంధ్రప్రభ ఇలా వ్రాసింది :

"ఇంతటి అద్వితీయమైన రచనని భాషాంతరీకరణం చెయ్యడం సులభంకాదు. దాదాపు అసాధ్యం - కాని శ్రీ పురి పండా అప్పలస్వామి గారు ఈ దుస్సాధ్యమైన కార్యాన్ని విజయవంతంగా సాధించారు. ఆయన మహాభారతాన్ని తెనిగించడం కంటే, ఈ నవల తెనిగించడంవల్ల ఎక్కువ ప్రజాసేవ చేశారు. సాధారణంగా తర్జుమాలలో భాష హింసపడుతుంది. మూలం లోని భావంలో అంతో ఇంతో తరుగు వస్తుంది. కాని ఈ నవలలో ఏదీ జరుగలేదు. పైగా అతిమధురమైన తెలుగు నుడికారంతో, ఆదికావ్యంలో వున్న కవితా గాంభీర్యం నిలబడింది. ఇదే, ఇంగ్లీషులో ఇంతటి సమర్థమయిన అనువాదం జరిగివుంటే - ప్రపంచ సాహిత్యంలో బహుమతి నందుకునే

పుస్తకం అయి వుండేది. సాహిత్య అకాడమీకి, పురిపండా అప్పలస్వామిగారికి జోహార్లు."

విశాలాంధ్ర సమీక్షిస్తూ 22-12-63 తేదీన ఇలా వ్రాసింది :

"మూలరచయిత ప్రతిభకు ఎంతో వన్నె తెచ్చి, రమ్యమైన శైలిలో మధురంగా తెనిగించిన పురిపండా అప్పలస్వామి గారి ప్రతిభ ప్రత్యేకించి పేర్కొనదగింది. ఆయన అనువాదం మూలానికి ఒక అందమైన ఆభరణం."

మట్టిమనుషులు పరామర్శిస్తూ 13-4-53 విశాలాంధ్ర ఇలా వ్రాసింది :

"దీన్ని గొప్పగా అనువదించారు శ్రీ పురిపండా అప్పలస్వామిగారు. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి అనువాదాలు చదివాక మళ్ళా అంత పకడ్బందీఅయిన అనువాదం ఈ నవలానువాదమే నేమో అనిపిస్తుంది. అనువాదకుల ప్రతిభ మూల గ్రంథానికి వన్నె దిద్దగలిగినట్టుంది."

1958 అక్టోబరు త్రివేణి ఇలా వ్రాసింది :

"The translation is accomplished with remarkable success by Sri Appalaswamy, himself a writer with an established reputation, and serves to familiarise the people of all the different parts of Andhra with the spoken language of the region bordering on Orissa, and thus incidentally to foster mutual understanding

among the Telugu speaking people of the different regions within Andhra too."

అప్పలస్వామిగారి 'ప్రాచీనయోధ స్మృతి" ఆ సంవత్సరం వెలువడిన ఉత్తమ కవితలలో ఒక్కటిగా గణించి, హిందీలోకి అనువదించి 1954-55 భారతీయ కవితలో చేర్చారు. వారి "ఒడిశా పాలేరు పాటలు" సింధీభాషలో అనువాదమై బొంబాయినుంచి వెలువడే 'కూంజ' సాహిత్య పత్రికలో వెలువడింది. (మే, 1964).

కవిత్రయంవారి భారతం వాడుకభాషలో పూర్తిచెయ్యడమేకాక, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రెండున్నరపర్వాలు వ్రాసి ఒదిలిపెట్టిన వ్యాస మహాభారతం కూడా అప్పలస్వామిగారు పూర్తిచేస్తున్నారు.

అప్పలస్వామిగారి సాహిత్య సేవను గుర్తించి ప్రభుత్వంవారు వారికి 1961 నుంచి మాసిక సాహిత్య భృతి ఇస్తున్నారు.

అప్పలస్వామిగారు కవి; నవ్యకవి, కథకుడు, విమర్శకుడు, వ్యాసకర్త, గొప్ప అనువాదకుడు, ఆంధ్ర సారస్వతంలో విప్లవపరిణామాలకు దోహదం కలిగించిన సాహిత్యయోధుడు, వ్యావహారిక భాషలో ప్రామాణికమైన ఉద్గ్రంథాలు వ్రాసి సార్థకతగన్న ప్రసిద్ధ రచయిత, మంచి వక్త, సాంఘికసేవకుడు, ప్రగతిభావాలున్న దేశభక్తుడు, సహృదయుడు, స్నేహశీలి. వీరి రచనలనుంచి,

"కోడలు అన్నైనా ఆలోచించాడు కాదు, దాసీగా చేసుకున్నాడు అంధమహారాజు. ఆ మహానుభావుడి దగ్గిరికే మళ్ళీ మావాళ్లు బయల్దేరితే, వీళ్ళతోసహా నేనూ వెళ్ళి, అతగాడికి కోడరికం చేయమంటావా ? కాక, దాసీపని చేయమంటావా నన్ను ? ఏం చెయ్యాలో నువ్వే చెప్పు మరి !"

"ఇదిగో, దుశ్శాసనుడి వేళ్ళలో తెగిపోగా మిగిలిన సగం ఇది" అంటూ గబాల్న సిగముడి విప్పింది. నల్లని మహా సర్పంలా వేలాడుతూన్న ఆ వేణీభారం ఎడమచేత్తో పట్టుకు నిలబడింది. వెళ్ళి కృష్ణుడిముందు పెట్టింది. "చూడు, కౌరవ సభలో సంధిమాట వచ్చేటప్పుడు దీన్నిమాత్రం మరిచిపోవద్దంటా. ఈ జుత్తుపట్టి ఈడ్చాడే వాడు, ఆ ఈడ్చిన చెయ్యి యుద్ధంలో తెగి కిందపడాలి. వాడి కట్టెతోకూడా అది ఇంతింత తునకలై బుగ్గిలో కలిసిపోవాలి; మాసిపోవాలి. అది కళ్ళతో చూసినప్పుడు - అప్పుడు కాని నాలో ఉడుకు చల్లారదు. అన్నా, సామాన్యంగా చల్లారే చిచ్చేనా ఇది ! ఇంతకీ కారణం - వాడున్నాడే - ఆ దుర్యోధనుడు - వాడి పీనిగ నా కాళ్ళముందు కళ్ళారా చూడకపోతే - భూతమంత గద మోసుకు తిరుగుతూన్న భీముడి బాహుబలం, తాటిపట్టంత గాండీవం వేసుకు బయల్దేరిన అర్జునుడి పరాక్రమం ఎందుకూ - తగలెయ్యనా అంటా. ఎన్నాళ్ళని, ఎన్నాళ్ళని చిచ్చు వొళ్ళో పెట్టుకున్నట్టు ఈ క్రోధం భరించనూ !"

—వ్యా. ఆం. మహాభారతం.

"చందమామ ఆకాశం మధ్యకి వచ్చాడు. పుచ్చ పువ్వులా వెన్నెల అంతటా వెదజల్లుతున్నాడు. ఆవులమందలో మదించిన ఆబోతులా ఆకాశంమీద అవుపిస్తున్నాడు. లోకుల బాధలన్నీ పోగొడుతున్నాడు. సముద్రం పొంగిస్తున్నాడు. భూమిలో మందరపర్వతంమీది శోభలాగ, మునిమాపువేళ సముద్రంలో శోభలాగ, నీళ్ళలో పద్మాల శోభలాగ, చంద మామలో శోభ వెలిగిపోతూ వుంది.

"ఆకాశంమధ్య చందమామ వెండిపంజరంలో రాజ హంసలా వున్నాడు. మందరపర్వతం గుహలో సింహంలా వున్నాడు. మదపుటేనుగుమీద వీరుడిలా వున్నాడు. వాడి కొమ్ముల అబోతులా వున్నాడు. శిఖరాల తెల్లకొండలా వున్నాడు. బంగారు దంతాల ఏనుగులా వున్నాడు. పదహారు కళలతోనూ వెలిగి పోతున్నాడు. మంచుబురదా, మచ్చా లేకండా ప్రకాశిస్తున్నాడు. ఇతర గ్రహాలు కనపడకండా ప్రకా శిస్తున్నాడు. స్వచ్ఛంగా, లక్షణంగా ప్రకాశిస్తున్నాడు. రాతి మీద నుంచున్న సింహంలా వున్నాడు. మహా యుద్ధంలో గజేంద్రుడిలా వున్నాడు. రాజ్యంచేస్తున్న రాజులా వున్నాడు."

—రామాయణం.

"1857 స్వాతంత్ర్య సమరానికి సాంకేతిక చిహ్నాలు ఎర్రపద్మమూ, చపాతీ ఎంత గంభీరమైన సాంకేతికాలివి ? ఏ విప్లవ ఋషి కల్పన ఇది! గ్రామాలకి చపాతీ, పటాలానికి ఎర్ర పద్మం.

"ఉన్నట్టుండి ఒక వూళ్ళోకి చపాతీ వచ్చేది. ఊరి చౌకీదారు చేతి కందేది. అతడొక చిన్న ముక్క కొరికేవాడు. ఊళ్ళోవాళ్ళకి ప్రసాదం పంచిపెట్టేవాడు. తరవాత ప్రక్కవూరికి చపాతీ అందించేవాడు. ఈ చపాతీ వచ్చిందంటేచాలు, వూరువూరంతా గుప్పుమనేది. చపాతీ తిన్నవూరు స్వాతంత్ర్య సమరాహ్వానం అంగీకరించిందన్నమాట. దేశంకోసం, ధర్మం కోసం ప్రాణాలర్పించడానికి సిద్ధపడిందన్నమాట. శపథం చేసిందన్నమాట. ఫరంగి పురుగులు హతమార్చి, తల్లిసంకెళ్ళు విడిపించడానికి నడుం కట్టిందన్నమాట." —వీరభారతం.





శ్రీ దేవులపల్లి రామానుజరావు

# శ్రీ దేవులపల్లి రామానుజరావు

వరంగల్లునగరంలో - బాగా సంపన్నమైన కుటుంబంలో పందొమ్మిదివందల పదిహేడవ సంవత్సరం - ఆగష్టు నెల - ఇరవై అయిదో తారీఖున జన్మించాడు శ్రీ దేవులపల్లి రామానుజరావు.

కలవారి యింట పుట్టి పెరగడంవల్ల జీవితం ఏమాత్రం వడిదుడుకులు లేకుండా సాగిపోసాగింది. దినదిన ప్రవర్ధమాన మవుతూ విరాజిల్లసాగారు. మెట్రిక్యులేషన్ వరకూ హనుమకొండలో విద్యాభ్యాసం గావించారు. మద్రాసు యూనివర్శిటీలో బి. ఏ., పట్టం పొందారు.

బానిస భారత దేశం స్వాతంత్ర్యా కోసం తపించి పోసాగింది. నిరంకుశ నైజాం ప్రభుత్వం, తెలుగు నేలను చీలదీసి ప్రత్యేకరీతి నీతులతో పరిపాలింప దొరకొన్నది. దేశంలో మహోద్ధృత రూపంలో స్వాతంత్ర్య సమర వెల్లువలు ముంచెత్తుతూన్నా వాటి ప్రభావం తగినంతగా నైజాం పరిపాలిత ప్రాంతంలో ప్రస్ఫుటింపలేదనే చెప్పాలి.

శ్రీ రామానుజరావు బి. ఏ., పట్టం పొందిన అనంతరం గ్రంథాలయోద్యమంలో రెండు సంవత్సరాలు పాల్గొన్నారు. ఆ పిదప రెండేళ్ళు యువజన కాంగ్రెసులో కర్తవ్యనిష్ఠతో పనిచేశారు. హైదరాబాదు సంస్థాన జాతీయోద్యమంతో సన్నిహిత సంబంధం వుంది ఆయనకి.

ప్రజాసేవలో జీవితాన్ని గడపాలనే అభిలాషగల అనేక మందికి కలిగినట్లుగానే శ్రీ రామానుజరావుకు కూడా న్యాయవాది కావాలనే కోరిక కలిగింది. వెంటనే నాగపూరు విశ్వ

విద్యాలయంలో ప్రవేశించారు. ఎల్.ఎల్.బి. పరీక్షలో కృతార్థులై - తిరిగివచ్చి న్యాయవాద వృత్తి ప్రారంభించారు.

న్యాయవాదవృత్తిని స్వీకరించినా ఆయనకు సాహిత్యోద్యమంలో ఎంతో అభిమానం. అందుకని "శోభ" అనే ఉన్నత శ్రేణికి చెందిన సారస్వత మాసపత్రికకు సంపాదకులుగా రెండు సంవత్సరాలు పనిచేశారు.

తెలంగాణా రాజకీయాలు క్రమక్రమంగా అస్తవ్యస్తమై వికృతరూపం ధరించ సాగాయి. విశృంఖలత్వం పెచ్చుపెరిగింది. దౌర్జన్యం - దోపిడీలు పెచ్చరిల్లాయి. హైద్రాబాదు సంస్థానం స్వతంత్ర్య ప్రతిపత్తితో వుండిపోవాలనే కాంక్ష ముస్లిమ్ నాయకులలో పొడచూపింది. స్వతంత్ర హైద్రాబాదు నినాదాలు నలుచెరగులా వినిపించ నారంభించాయి. ఇదే సమయమనుకున్న కొంతమంది మత దురహంకారులు గూండాలను అమాయక ప్రజానీకంపైకి పురిగొల్పారు.

రజాకారు ఉద్యమం ఒకవైపు - కమ్యూనిష్టు గోరిల్లా యుద్ధం మరోవైపు, వికృత వికటహాసాలతో తెలంగాణా మొత్తాన్ని కదలించివేయ సాగాయి. ఏ క్షణంలో ఏ పచ్చటి సంసారం మట్టిగొట్టుకు పోతుందో ఎవరూ చెప్పలేనంత దౌర్భాగ్యస్థితికి వచ్చింది నిజాం సంస్థానం.

సాహిత్యోద్యమంలో జీవయాత్రను సాగించాలనుకున్న శ్రీ రామానుజరావు హృదయంలో ఈ రాక్షస రాజకీయ విధానాలు చాలా ఆవేదనను కలిగించాయి. ఈఘోరాతిఘోరమైన అభివృద్ధి నిరోధక విధానాలను ఎదుర్కొని రూపుమాపడమే తక్షణ కర్తవ్యంగా ఆయనకు పొడగట్టింది. అందుకు

తన భావాలను విరివిగా ప్రచారమయ్యేలా చూడటం అవసరం. అందుకు తాను నడుపుతోన్న సారస్వత మాసపత్రిక తగిన సాధనగా తోచలేదు. అందుకు అనువైన సాధనకోసం ఆలోచిస్తూండగానే అంతవరకు వారపత్రికగా నడుస్తోన్న "గోలుకొండ" పత్రిక దినపత్రికగా మారింది. అందులో శ్రీ రామానుజరావు ఉపసంపాదకులుగా అయ్యారు. ఎదురుచూచిన అవకాశం ఇంపుమూలంగా దొరికింది. నాటినుండీ నాలుగు సంవత్సరాలపాటు అందులో పని చేశారు. తాను ఏ అభివృద్ధి నిరోధక విధానాలను ఎదుర్కోవాలనుకున్నారో అందుకు తగిన విధంగా తమ భావాలను విస్తృతరూపంలో ప్రచారమయ్యేలా ప్రయత్నం సాగించారు.

భారతదేశం స్వాతంత్ర్యం పొందింది. సంస్థానాలు మెల్ల మెల్లగా విలీనమయ్యాయి. ఎంతో రక్తపాతంతో - మతోన్మాదంతో కల్లోలితమైన హైద్రాబాదు సంస్థానం కూడా పోలీసుచర్య అనంతరమే అయినా దేశం మొత్తంలో కలసిపోయింది.

అనంతరం శ్రీ రామానుజరావు సారస్వత పరిషత్తు అభివృద్ధికిగాను అశేషకృషి సాగించ సాగారు. తెలంగాణా సాహిత్య విమర్శకులలో అగ్రగణ్యులుగా కీర్తి నందారు.

నిజానికి న్యాయవాద వృత్తి అంటేనే ఆయనకు ఎంతో ఇష్టం. ఆ వృత్తిలో గొప్ప స్థానాన్ని పొందాలనే ఆయన అభిలాష. కాని పరిస్థితులు విచిత్రంగా ఆయనను నడిపించాయి అనేక ఉద్యమాలలో ఆయన మనఃపూర్వకంగా పనిచేసి వాటి అభివృద్ధికి కారకులయ్యారు.

సహచరులను కూడగట్టుకుని వారిచేత అవసరమైన పనులను చేయించ గలగడంలో మహా నేర్పరి. తెలంగాణా లోని ప్రధాన సాంస్కృతిక సంస్థ అయిన ఆంధ్ర సారస్వత పరిషత్తుకు నాయకత్వం వహించి అత్యున్నతస్థితికి తెచ్చింది శ్రీ రామానుజరావే” నని అనేకులచేత శ్లాఘింపబడ్డా రాయన.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. అది సమగ్రమైన ఆంధ్ర రాష్ట్రం కాదనీ, తెలంగాణాతో కూడిన సమగ్ర ఆంధ్ర రాష్ట్రాన్ని సాధించడానికీ, ఆంధ్రజాతి సర్వతోముఖాభివృద్ధికీ పూనుకోవటానికి నాయకులంతా బద్ధకంకణులై కృషిచేయ వలసివుందనీ ఎలుగెత్తి చాటినవారిలో శ్రీ రామానుజరావు కూడా ఒకరు.

“హైద్రాబాదులో స్వాతంత్ర్యోద్యమము” అనే గ్రంథాన్ని వ్రాశారు. శ్రీ అయ్యదేవర వారితోనూ – మరికొంత మంది పెద్దలతోనూ కలిసి విశాలాంధ్ర నిర్మాణోద్యమాన్ని నడిపారు. లక్ష్యం సిద్ధించింది. విశాలాంధ్ర ఏర్పడింది.— “విశాలాంధ్ర వచ్చింది” అన్న పేరుతో ఓ పుస్తకం వెలువ రించారు.

శ్రీ రామానుజరావుతో సంబంధంలేని సారస్వతసంఘం గానీ, విద్యాసంస్థగాని రాష్ట్రంలో ఏదీ లేదనడం ఆశ్చర్య పోవలసిన విషయంకాదు. కొంతకాలం ఉస్మానియా విశ్వ విద్యాలయం సెనేటులోనూ – రాష్ట్ర ప్రభుత్వ విద్యా సలహా సంఘంలోనూ, ఇతర అనేక సంఘాలలోనూ శ్రీ రామానుజ రావు సభ్యత్వం పొందారు. కేంద్ర సాహిత్య ఎకాడమీ

కౌన్సిల్ సభ్యులు. సాహిత్య ప్రతినిధిగా రాజ్యసభలో స్థానం పొందారాయన.

ఆయనకు ప్రాచీన సాహిత్యంలోని భారతం, భాగవతం అంటే ఎంతో ఇష్టం. తెలుగులోని తియ్యదనాన్ని హిందూస్తానీవారికి తెలియజేసేందుకు ఉర్దూలో తెలుగు సాహిత్య చరిత్రను ప్రచురించారు. హాలీ, గాలిబ్ లంటే అపరిమిత ఆదరం. మౌలానా షిబ్లీ వచన రచయిత ఆయనకు చాలా ఇష్టుడు. జాతీయోద్యమానికి సంబంధించినంత వరకూ హాలీ రచనలను తెలుగులో ప్రచురించారు వారు.

ఠాగూరు శతవార్షిక జయంతి సంఘ కార్యదర్శిగా - గురజాడ శత వార్షిక జయంతి సంపుటి సంపాదకులుగా ఎంతో ఒప్పు నేర్పులతో పనిచేశారు శ్రీ రామానుజరావు.

వారు అనేకపుస్తకాలు వ్రాశారు. అందులో 'నవ్య కవితానీరాజనము'-'సారస్వత నవనీతం'-'వ్యాసమంజూష' అనేవి సాహిత్య విమర్శకాలు. 'పచ్చతోరణము' పద్యాలు. 'విశాలాంధ్ర రాష్ట్రము' - 'హైదరాబాదులో స్వాతంత్ర్యోద్యమము' - 'విశాలాంధ్ర వచ్చింది' అనేవి రాజకీయ సంబంధమైనవి. 'నవనీతం' అనేది సాహిత్య వ్యాసాల సంపుటి. - 'తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము' అనేది సంస్కృతికి చెందింది. - 'మనదేశము' - తెలుగుదేశము' - 'జవహర్ లాల్ నెహ్రూ' - 'గౌతమ బుద్ధ' - 'ఆదిమ నివాసులు' అనేవి బాల సాహిత్యం. ఉర్దూలో 'తెలుగు సాహిత్య చరిత్ర' అనేది వెలువడింది.

శ్రీ రామానుజరావు పొట్టిమనిషి. పైజామా-షెర్వా

నీలను ధరించడం అలవాటు. అవి అంటేనే ఆయనకు అభిమానం మెండు. ప్రాచీనసంస్కృతిలోని ఉదాత్తతను కాలానుగుణ్యంగా మలచుకొని, దాని నిగ్గును రక్షించుకోవాలని వారి భావం. భారతీయ సంస్కృతిలో విశ్వజనీనత వెల్లివిరిస్తోంది. దానినే భారతీయులు కాపాడుకోవాలని అభిలషిస్తారాయన. అంతటి ఉదాత్తమైన విశ్వజనీనతే భారతీయ సంస్కృతిని శాశ్వతం చేయగలుగుతూందని వారు గాఢంగా నమ్ముతారు.

తెల్లవారుఝాము నాలుగున్నర గంటలకే లేచి స్నానాదులు పూర్తిచేసుకుని, ఆరున్నరనుండి ఎనిమిదిన్నర వరకూ ముఖ్యమైన వ్రాతపనులు చూచుకుని, అటుపిమ్మట సారస్వత పరిషత్తు కార్యాలయాన్ని చేరుకుంటారు. అక్కడ పరిషత్తు - సాహిత్య ఎకాడమీల పనులు చూచుకుని పన్నెండు గంటలకు ఇంటికి వెళ్ళి భోజనాదులు పూర్తిచేసుకుని ఓ గంటన్నర విశ్రమిస్తారు. సాయంత్రం నాలుగున్నరకు పరిషత్తు కార్యాలయం జేరి ఆరుగంటల వరకూ పని చూచుకుని ఆ పిదప విహారానికి బయలుదేరుతారు.

ఆయనకు బాదరబందీఏమీ లేదనే చెప్పాలి. కుమారుడు చేతికి అందివచ్చే కాలం. అతడు పెద్దవాడైన అనంతరం అన్ని పనులనుండీ విడుదలపొంది వరంగల్లులో స్థిరపడి అభిమానకరమైన తోటపని చేసుకుంటూ మిగతా కాలాన్ని వెళ్ళబుచ్చాలని కోరిక. వీరి ఈ కోరిక విజయవంతం కాగలదనడానికి ఎలాంటి సందేహమూ కలగదు. తలచిన ప్రతి విషయంలోనూ ఆయన ఇంతవరకూ దిగ్విజయుడే అయి వేనోళ్ళ కీర్తింపబడటం చూస్తూనే వచ్చాముగదా ?

శ్రీ రామానుజరావుగారు వివిధ కాలాలలో నిర్వహించిన కార్యక్రమాల వివరాలు కొన్ని ఇవి :

రాజకీయ రంగంలో - హైదరాబాదు సంస్థాన జాతీయోద్యమంలో సన్నిహిత సంబంధం-ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ సభ్యత్వం - 1945-46 లో వరంగల్లు యువజనకాంగ్రెస్ అధ్యక్షుడుగా పనిచేశారు. 1949-50 హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఎలక్షన్ ట్రిబ్యునల్‌లో సభ్యులు. 1955 లో అలంపూర్ తాలూకా కాంగ్రెస్ ఎన్నికలకు రిటర్నింగు ఆఫీసరుగా నియమించబడ్డారు. 1957 లో హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెస్ సామాన్య ఎన్నికల ప్రచార అధికారి అయ్యారు.

సహకార సంస్థలలో 1953 నుండి 57 వరకూ హైదరాబాదు కోఆపరేటివ్ ట్రేడింగు సొసైటీకి డైరక్టరుగా - 1955 నుండి హైదరాబాదు కోఆపరేటివ్ ఇన్స్యూరెన్సు సొసైటీ డైరెక్టరుగా పనిచేశారు.

పార్లమెంటులో - 1960 నుండి 62 వరకూ రాజ్యసభ సభ్యులుగా వున్నారు.

భారత్ సేవక సమాజ్‌లో - జనరల్ కౌన్సిల్ సభ్యునిగా-సమాచార కార్యనిర్వాహకవర్గ కార్యదర్శిగా వున్నారు.

సాహిత్య రంగంలో - 1957 నుండీ ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ కార్యదర్శి. 1957 నుండి 60 వరకూ ఆంధ్రప్రదేశ్ లెజిస్లేచర్ పరిపాలనానుకూలంగా రూపొందింపబడిన పారిభాషిక పదకోశం నిర్మాణ కార్యనిర్వాహక వర్గంలో సభ్యునిగా పనిచేయడం జరిగింది. 1949 నుండీ ఆంధ్ర సారస్వత

పరిషత్తు ఉపాధ్యక్షులుగా–1952నుండి 54 వరకూ అధ్యక్షులుగా 1959 నుండి క్రొత్తఢిల్లీ సాహిత్య ఎకాడమీ తెలుగు సలహా సంఘ సభ్యుడుగా వున్నారు. 1960 నుండి 62 వరకూ ఆంధ్ర ప్రదేశ్ ఠాగూరు శతజయంతి కార్యవర్గ కార్యదర్శిగా పని చేశారు. హైద్రాబాదు సంస్కృత విద్యాసభ సభ్యునిగా, ప్రేమచంద్ సంఘ ఉపాధ్యక్షునిగా, మౌలానా ఆజాద్ స్మారక పరిశోధనాసంస్థ ఎగ్జిక్యూటివ్ బోర్డులో సభ్యునిగా, అంజుమన్ తరఖీ - ఉర్దూ ఎగ్జిక్యూటివ్ బోర్డు సభ్యునిగానూ వున్నారు. 1962 నుండి 63 వరకూ క్రొత్తఢిల్లీ సాహిత్య ఎకాడమీ కౌన్సిల్ సభ్యత్వం నిర్వహించారు.

గ్రంథాలయోద్యమం - ఈ ఉద్యమంలో వీరు అశేష కృషి జరిపినవారనక తప్పదు. వరంగల్లు ఆంధ్ర గ్రంథాలయ మునకు కార్యదర్శిగా పనిచేశారు. 1963 సంవత్సరం హైద్రా బాదులో జరిగిన ఆరవ యావద్భారత గ్రంథాలయ మహా సభకు ఆహ్వాన సంఘ కార్యదర్శిగా పనిచేశారు. హైద్రా బాదు లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులు.

విద్యాసంబంధమైన సంస్థలు - 1952 నుండి 55 వరకూ కేంద్ర విద్యా సలహా సంఘంలో, 1952 నుండి 57 వరకూ పాఠ్యగ్రంథాల కమిటీలో, 1952 నుండి 57 వరకూ విద్యా శాఖలో ఉపాధ్యాయుల సెలెక్షన్ కమిటీలో, 1955 నుండి 57 వరకూ రాష్ట్ర గ్రంథాలయ పుస్తక సంఘంలో, 1952 నుండి 54 వరకూ వయోజన విద్యాసంఘంలో, 1952 నుండి 54 వరకూ హిందీ-సంస్కృత సంఘంలో, 1952 నుండి 54 వరకూ కళాశాల విద్యాసంఘంలో, 1954 నుండి ఉస్మానియా

విశ్వ విద్యాలయం సెనేటు సభ్యులుగా, రియాయతీ స్కాలర్ షిప్ సంఘం సభ్యులుగా, 1958 నుండి 60 వరకూ ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ తెలుగు టైపు రైటర్‌కీ బోర్డు సంఘం అధ్యక్షునిగా, 1956 నుండి హైద్రాబాదు మదరసా అయజ్జా ఉన్నతపాఠశాల ఎగ్జిక్యూటివ్ సంఘ ఉపాధ్యక్షునిగా, ముంతాజ్ యవరుద్దులా ఎడ్యుకేషన్ ఇ-వక్ఫ సభ్యునిగా, ఉర్దూ ఆర్ట్స కళాశాలా పరిపాలనా సంఘ సభ్యునిగా, ముంతాజ్ సైన్స కళాశాలా పరిపాలనా సంఘ సభ్యునిగా, హైద్రాబాదు అనఫియా ఉన్నతపాఠశాలా ఎగ్జిక్యూటివ్ బోర్డు సభ్యునిగా పనిచేశారు.



130

# ప్రజా ప్రచురణలు
## పవరుపేట, ఏలూరు - ఆంధ్ర.

| | | |
|---|---|---|
| శ్రీ గోరా | వల్లభనేని కాశీ విశ్వనాథం | 4-00 |
| పోలీసు విప్లవం | ,, | 3-50 |
| దేశభక్తులు-దీపావళిజ్యోతులు | ,, | 1-50 |
| వెలుగు దివ్వెలు | ,, | 1-25 |
| వీరదంపతులు | ,, | 1-25 |
| 1942 ఆగష్టు విప్లవం | ,, | 1-00 |
| కారణజన్ముడు | జగం | 2-7 |
| మన్యంలో విప్లవం | రాధాకృష్ణమూర్తి | 4-00 |
| శృంగారవనం | హరిప్రసాదరావు | 2-00 |
| కామరాజ్ | పరిశీలకుడు | 1-00 |
| ఋణవిముక్తి | బి. వి. వి. ఆర్. సుబ్బారావు | 3.00 |
| శరత్ చెప్పిన కథలు | బాబ్జీ | 1-31 |
| బాలబంధు | వల్లభనేని కాశీ విశ్వనాథం | 4-00 |
| బాల విహారం | ,, | 4-00 |
| కమలా నెహ్రూ | పి. శ్రీనివాసరావు | 0-75 |
| చాచా నెహ్రూ | వల్లభనేని కాశీ విశ్వనాథం | 2-00 |
| తాతా మనుమడు | ,, | 1-00 |
| అమ్మా కొడుకు | ,, | 1-25 |
| బిస్కెట్లు | ,, | 0-75 |
| లోకజ్ఞానం | ,, | 0-75 |
| జనవాక్యం | ,, | 0-37 |